శ్రీ కులశేఖరాళ్వారుల

# పెరుమాళ్ తిరుమొళి

అనువాదము

ఇంద్రగంటి నాగేశ్వర శర్మ




ప్రచురణ

శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి, ఐ.ఏ.ఎస్.,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు -

తిరుపతి

1994

SRI KULASEKHARALWARULA PERUMAL THIRUMOLI

by

Indraganti Nageswara Sarma,

Edited by:

D. Nagasidda Reddi

T.T.D. Religious Publication Series No. : 444

First Edition: 1994

Copies : 1000

Published by :

D.V.L.N. MURTI, I.A.S.,

Executive Officer,

Tirumala Tirupati Devasthanams,

Tirupati.

Printed at :

T. T. Devasthanams Press,

Tirupati.

# ముందుమాట

భక్తిజ్ఞాన వైరాగ్య సంపన్నులై, విశిష్టాద్వైతమతధర్మ విస్తారకులై, పరమేశ్వర భక్తిరసప్రవాహ నిమగ్నులై తరించిన మహనీయులు ఆళ్వారులు. ఆళ్వార్ అనే శబ్దానికి రక్షించేవాడు లేక భగవద్భక్తి పరవశుడు అని అర్థం. ఈ మహాపురుషులలో కులశేఖరులు ఒకరు.

ఈయన క్రీ.శ. 767వ సంవత్సరంలో కేరళదేశంలోని 'కాళి' అనే పట్టణాధీశుడైన దృఢవ్రతునికి భగవంతుని కౌస్తుభరత్నాంశంలో జన్మించారు. క్షత్రియ వంశీయుడైన కులశేఖరులు మహాభక్తుడే కాకుండా ప్రజారంజకుడైన పరిపాలకుడుకూడ. సంస్కృతంలో ముకుందమాల, తమిళంలో పెరుమాళ్ తిరుమొళి -- వీరి రచనలు. పరమభాగవతోత్తముడైన కులశేఖరుల అనన్యసామాన్యమైన భక్తిప్రపత్తులకు నీరాజనంగా 'పెరుమాళ్' అని ప్రజలు వీరిని ప్రశంసించారు. తిరుమొళి అనగా సుభాషితాలు. నాలాయిర దివ్యప్రబంధంలో చోటుచేసుకున్న వీరి సుభాషితాలు 'పెరుమాళ్ తిరుమొళి' అనే పేరుతో ప్రసిద్ధి చెందాయి. ఇది పది దశకాలుగా విభజించబడి ఒక్కొక్క దశకంలోను పదిపాశురాలు కలిగివుంటుంది. భగవానుని అనంతగుణగణాల్ని కీర్తించే ఇందులోని వందపాశురాలు ఒక్కొక్కటి ఒక మకరంద బిందువు.

కవి పండితులైన శ్రీఇంద్రగంటి నాగేశ్వరశర్మగారు "ఈ పెరుమాళ్ తిరుమొళి"ని సరళమనోజ్ఞమైన సులభశైలిలో పద్యరూపంలోను, వచనరూపంలోను కూడ అనువదించి తిరుమల తిరుపతి దేవస్థానములకు సమర్పించారు. సంపత్కరాలు, పాపనాశకాలు, సమస్త అభీష్టప్రదాలు ఐన ఈ పాశురాల్లోని కవితావైశిష్ట్యాన్ని, భక్తి ప్రపత్తుల్ని తెలుగు పాఠకులు గ్రహించేటట్లు చేయాలనే సంకల్పంతో, ఆర్షధర్మవ్యాప్తికై అవిరళ కృషి సల్పుతూవున్న తిరుమల తిరుపతి దేవస్థానములు ఈ గ్రంథాన్ని ప్రచురించడం జరిగింది. పాఠకులకు ఇది ప్రయోజనకరం కాగలదని ఆశిస్తున్నాము.

డి.వి.ఎల్.ఎన్. మూర్తి,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

తిరుపతి
ఏప్రిల్ 18, 1994

# విజ్ఞప్తి

ద్రావిడ దేశమున, మహానుభావులగు విష్ణుభక్తులు భగవంతుడగు శ్రీరామచంద్రుని, పెరుమాళ్లని వ్యవహరింతురు.

శ్రీరామచంద్రుని జన్మనక్షత్రము పునర్వసు. కులశేఖరాళ్వారుల జన్మ నక్షత్రము కూడ పునర్వసే. ఆయన ఆరాధ్యదైవముకూడ శ్రీరామచంద్రుడే. కావుననే ఆ దేశమునందలి విష్ణుభక్తులు అందరును ఆయనను కులశేఖర పెరుమాళ్లని యందురు.

ప్రపన్నకులమునకు తలమానికమైన కులశేఖరాళ్వారులు అనుగ్రహించిన తమిళప్రబంధమునకు 'పెరుమాళ్ తిరుమొళి' యని పేరు. తిరుమొళి యనగా సుభాషితము లేక సూక్తి అని యర్థము. కులశేఖరుని సుభాషితములుగలది పెరుమాళ్ తిరుమొళి. ఇందలి పాశురములు నూరు. ఇవిగాక మరియైదు అదనముగా నున్నవి. ఈ యైదును ఆయన ఘనతను చాటునవి.

పెరుమాళ్ తిరుమొళి ప్రబంధము ద్రావిడ వేదమునందు గల ప్రథమ సహస్రమున, అయిదవ శతకముగా చేర్పబడినది. ఇది యాయన మహిమోన్నతికి నిదర్శనము.

ఈ పాశురాలను చదివినవారికి కులశేఖరుల భక్తిప్రపత్తుల స్వరూప స్వభావములెంత యుదాత్తము లైనవో తెలియును. పాశుర మనగా పాట యని అర్థము. అది తెలుగున పద్యమువలె నుండి, శ్రావ్యముగా పాడుటకు అనువుగా నుండును. పాశురములు నూరు. అవి పదిభాగములుగా నున్నవి. ప్రతి భాగమునను పదేసి యున్నవి. ప్రతి దశకమునకును కొంత పరిచయముగావలయును. అది గ్రహించిన పిమ్మటనే, అది చదివిన యెడల అందలి భావము అవగాహనమగును. పరమభక్తాగ్రణులై, తన్మయులై శ్రీ హరిని భావించుచు, ఆళ్వారులనుగ్రహించిన యీ తిరుమొళి యందలి పాశురములు చదువుకొనువారు కులశేఖరులవలె, భక్తి భావబంధురు లగుదురుగాక --

గ్రంథకర్త

# కులశేఖరాళ్వారుల

# పెరుమాళ్ తిరుమొళి

## మొదటి దశకము

ఆళ్వారులు ఈ ప్రథమదశకమున శ్రీరంగములోని, శ్రీరంగనాథుని సేవించుటయందలి కోరికను (ఆభిముఖ్యమును) ప్రతి పద్యమునందును భక్తితత్పరులై వెల్లడించిరి.

ఇట్లు అభిలాష ఆయనకు మొదటినుండియు నుండుటచేతనే తమ పురమునందలి పౌరులను ప్రతిదినమును రంగయాత్రకు సిద్ధము గండని, ప్రోత్సహించు చాటింపు వేయించుచు, వారియందు రంగభక్తిని మేల్కొలుపు చుండెడివారని ముకుందమాలలోని "ఘుష్యతే యత్ర...." అను మొదటి శ్లోక భావమునుండి గ్రహింపగలము.

ఇందు శ్రీరంగదివ్యధామమునందు బ్రహ్మ, రుద్ర, ఇంద్ర, ఆది దేవతలచేతను, యోగీంద్రులగు నారదాదులచేతను స్తుతింపబడుచు, భోగీంద్రశయానుడై యుండిన రంగనాథుని అనన్యభక్తితో సేవించి, సంతోషించుట జన్మయెత్తినందులకు ఫలమని ఆళ్వారులు తమ కోరికను విపులముగా పది పాశురాలలో వివరించిరి.

శ్రీరంగనాథుని స్వయముగా కన్నులార దర్శించి, స్తుతించి, అటనున్న పరిచారకులతో గలసి స్వామిపాదములను పూలతో నర్చించుట - చేతులు జోడించి యెదుట నిలచి బిగ్గరగా స్తుతించుట - స్వామి ముఖపద్మ మును, నయనారవిందములను గాంచి ఆనందబాష్పములతో భక్త్యావేశమున గొల్చుట - మోక్షప్రాప్తికై వేడుకొనుట - స్వామికీర్తిని భక్తశ్రేణితో నేకమై, భక్తిపారవశ్యమున బిగ్గరగా గానముచేయుచు నాట్యమాడుట - దక్షిణదేశమున దక్షిణదిశాభిముఖముగా శేషశాయియై వెలసి లోకాలకు శ్రేయములుగూర్చు స్వామినిగాంచి హర్షాశ్రువులతో సేవించుట - ఇత్యా దిగా అనేక విధములుగా నర్చించు భాగ్యము తమ కెప్పుడు లభ్యమగునా యని మిగుల నుత్కంఠతో వెల్లడించిరి. ఇది చదివినవారు తమ వలెనే

సమస్త కల్యాణప్రపూర్ణుడగు శ్రీరంగేశుని దర్శనసేవా భాగ్యములందు అభి ముఖ్యముగలవారై స్వామి చరణకమలములందు పరమ భక్తితత్పరులు అగుదురని ఆళ్వారులు విశ్వసించిరి.

## రెండవ దశకము

శ్రీరంగనాథుని సేవించుటలో తమకుగల కోర్కెను పది విధాల వివరించిన మీదట, కులశేఖరులు ఈ రెండవ దశకమున శ్రీ రంగేశుని భక్తవరుల వైభవమును ప్రశంసించిరి.

భగవద్భక్తికి పరమావధి యైనది భాగవతభక్తి యను భావము గలిగిన కులశేఖరులు తాము రచించిన ముకుందమాలలో

"త్వద్భక్త భక్త పరిచారక భక్త . . . . "

అను శ్లోక వాక్యముననుసరించి "దేవా నేను నీకు దాసానుదాసుడ నుగా, దాసులలో కడగొట్టు దాసుడనుగా నుండుటనే కోరుకొందును. నా కదియే అనుగ్రహింపుము" అని వేడుకొనిరి.

ఆయన రంగనాథుని దర్శించి, సేవించి తరించుటకై పురజనుల నందరను తనతోపాటు ప్రయాణము గండని చాటింపు వేయించుట, అంతలో ఆనాడు, విష్ణు భక్తులు వచ్చుటతో వారిని ముందుగా సేవించుటకై ప్రయాణమును వాయిదా వేయించుట జరిగెడిది. ఈ విధముగనే రోజులు గడచెడివి.

ఆళ్వారులు 'భగవద్భక్తులయెడ (భాగవతులయెడ) ఎక్కువ ప్రావ ణ్యము (నమ్రత) గల వారికి భగవంతునియెడ భక్తియధికమగుటకు అవకాశ ముండునను ఉత్తమభావము గలవారగుటచే, అది లోకమునకు తమ నడవడిననుసరించి చాటిరి.

ఆళ్వారులు జ్ఞానభక్తుల ప్రశంసయే యీపాశురమున చేపట్టిరి. అట్టి వారి సేవయే తమ కనుగ్రహింప వలయునని రంగేశుని వేడుకొనిరి.

భక్తి యన నిరంతరమును శ్రద్ధతోగూడిన అనన్యచిత్తముతో భగవంతుని యెడ ప్రేమగలిగియుండుట. అది యొక అనిర్వచనీయమైన అంతఃకరణ ప్రవృత్తి విశేషము.

భగవంతుని భక్తులు -- ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని - అని నాలుగు విధములుగా నుందురు.

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః.

భక్తులలో జ్ఞాని సర్వోత్తముడు. అతడే ఏ కోర్కెయు లేక అనన్య భక్తి గలవాడై యుండును. అట్టి జ్ఞానభక్తునికే నాయందు పరమప్రీతి యుండును. అట్లే నాకును ఆ జ్ఞానభక్తునియందే పరమ ప్రీతియు నుండును అని భగవానుని వచనము.

జ్ఞానభక్తునిలోనే అనన్యత్వమును నిష్కామతయు నుండును. అనన్య భక్తి యనగా కంటికి కనబడు అన్యపదార్థమునెడల ఆసక్తిలేక, కేవలము పరమాత్మయందే నిరంతర ప్రేమ, అనురాగము, ఆసక్తి గలిగి యుండుట. ఇదియే పరమాత్మను దర్శించుటకు ఏకైక మార్గము.

మానవునికి అనన్య భక్తివలన పరమాత్మను దర్శించుటకు, అభ్యాసవశమున భగవంతునికి సన్నిహితుడై యుండుటకు, అంతకంటె సాధనవశమున పరమాత్మలో నైక్యమగుటకు అవకాశముండును.

"తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే."

ఎల్లపుడును నాయందు మనస్సుగలవారై, ప్రీతితో భజించునట్టి వారికి దేనిచేత నామనస్సును పొందగలరో అట్టి జ్ఞానయోగమును - ఆత్మానాత్మవివేకమును - ఇచ్చుచున్నాను.

"నాయందు మనస్సుగలవారై, ప్రీతితో నన్ను భజించువారికి నన్ను పొందగల జ్ఞానయోగమును ప్రసాదించుచున్నాను" అనునది భగవానుని హితబోధ. అనగా భగవత్ప్రాప్తికి పరమాత్మయే సాధనమైన వాడని అర్థం.

'జ్ఞానీ తు ఆత్మైవ మే మతమ్'

"భక్తులందరును శ్రేష్ఠులే. అయినను జ్ఞానభక్తుడు సర్వోత్కృష్టుడు. అతడే నేను, నేనే అతడు" అని యనుచు--

యే భజంతి తు మాం భక్త్యా, మయి తే తేషు చాప్యహమ్.

"ఎవరు నన్ను అనన్యభక్తితో నారాధింతురో వారియందు నేనును, నాయందు వారును నుందురు" అనుటచే భగవంతుడును జ్ఞానభక్తుడును ఒకరే యగుదురు.

అట్లు వారిద్దరును నొకటే కావున, ప్రత్యక్షదైవముగానున్న జ్ఞానభక్తు ని సేవించినవాడు, భగవంతుని సేవించిన వాడుగనే అగుచున్నాడు.

జ్ఞానభక్తులు -- పరమాత్మునందే మనస్సు కలవారు. పరమాత్మను పొందిన ఇంద్రియములు కలవారు. ఆయనను గూర్చియే ఒకరితోనొకరు ముచ్చటించుకొనుచు నిత్యమును సంతృప్తినొంది యానంద నిమగ్నులగు దురు.

భగవంతుని కటాక్షము వలననైన, కేవల జ్ఞానభక్తి నిష్ఠతో గూడిన పరాభక్తి గలవారు పోతనగారి వాక్యములలో చెప్పినయెడల --

"కమలాధీశ కథాసుధారస నదీ కల్లోల మాలా పరిభ్రమము" కలవారు.

"ఆనందాశ్రులు కన్నులఁ వెడల రోమాంచంబుతో" భగవంతుని పాద పద్మ ధ్యానారూఢులై యుందురు.

హరిపాదసరోజ చింతనముపై ననిశంబును 'మదీయబుద్ధిని అత్యాదర తృప్తితో చేయగదయ్య యీశ్వరా' యని ప్రార్థించు చుందురు.

మహనీయులగు జ్ఞానభక్తులు తమజీవితములను, పరమాత్మ సేవకే అంకితమొనర్తురు. వారి త్రికరణములును, దైవసంబంధములైనవిగనే ఉండును.

'ప్రహ్లాదశ్చాపి దైత్యానాం' అని భగవానుడు 'అసురులలో ప్రహ్లాదుడను నేనే' యని సెలవిచ్చియున్నాడు. అందువలన భక్తియొక్క పరాకాష్ఠస్థితి యందు భక్తుడును భగవంతుడును ఒక్కటే యని గ్రహింపతగును--

ఇంతియేగాక "జ్ఞానీ తు ఆత్మైవ మే మతమ్" అను వాక్యమునకు జ్ఞాని ఆత్మయగునేని, భగవంతుడు శరీరము అని భావించినచో భగవంతునకు సహితము ఆత్మభూతులగు భాగవతులయందు ప్రావణ్యము భగవత్ప్రావణ్యముకంటె అతిశయించినది అనియు గ్రహింపగలము.

కావుననే కులశేఖరులు భగవంతునితో తుల్యులైన జ్ఞానభక్తులప్రశంస చేపట్టినారు. అట్టి వారి మానసికస్థితి తమకు లభ్యపడవలెనను మహదాశయముతోనే దీనిని రచించిరి.

భాగవతులయెడ భక్తి ప్రపత్తులున్నవారికి భగవంతుని యెడలను భక్తి ప్రపత్తులలవడుటలో సందేహములేదని ప్రజలకు హితము నుపదేశించిరి.

భాగవతులను సేవించు భాగ్యముగలవారికి, వారితోడి సాంగత్య సంభాషణములుగలవారికి, సాలోక్యమను ముక్తి లభించును.

యోగిశిఖామణి యగు శుకమహర్షిని గాంచిన పరీక్షిన్మహారాజు

"నీవంటి విప్రవరున్ పేర్కొనునంతటన్ భసితమౌ పాపంబు నాబోటికిన్."

భవదాలోకన భాషణార్చన, పదప్రక్షాళన స్పర్శనాది విధానముల ముక్తి చేపడుట యాశ్చర్యమే. నీ పదస్పర్శనముచే గురు పాతక సంఘంబులు పారిమాలు గదయ్య యోగిభూషణ వింటే" అని కొనియాడుచు పరమభక్తాగ్రేసరుని స్తుతించిన, పోతన భాగవత ఘట్టమును జదివిన, భగవంతునికి సహితము ఆత్మభూతులైన వారియెడ భక్తితత్పరత యలవడుట ఘనమైనదని గ్రహింపగలము.

కావుననే ఆళ్వారులు జ్ఞానభక్తులయెడ తమకుగల ప్రావణ్యాతిశయమును పదివిధాల సూచించిరి. వీరి వలెనే మధురకవి యాళ్వారులు జ్ఞానభక్తులైన నమ్మాళ్వారులకు దాసానుదాసులై యుండి 'కణ్ణినున్ శిఱుత్తాంబు' అను పేరిట చెప్పిన పాశురములలో, తాము నమ్మాళ్వారుల చరణముల నాశ్రయించి, యామూలముగ, భగవంతుని సేవించి భగవత్ప్రావణ్యముకంటె భాగవతప్రావణ్యమే గొప్పది యని యనుభవపూర్వకముగా లోకమునకు తెల్పిరి.

తిరువాయిమొళి యందలి తృతీయశతకమున సప్తమదశకమంతయు అట్టి భావమునే బోధించుచున్నది.

ఇందు ప్రతిపాశురమును (పద్యమందు) భగవంతుని మహిమాను వర్ణనముతో ఆరంభమగును. చివర భాగము భాగవతవిషయముగా నుండును.

## మూడవ దశకము

కులశేఖరులు వెనుకటి దశకమున జ్ఞానులగు భగవద్భక్తుల యొక్క ప్రావణ్యాతిశయమును కొండాడి, యీ దశకమున లక్ష్మీసనాథుడగు రంగనాథుని యెడ తమకు గల భక్తివిషయమున తామొక యున్మత్తుడుగా నుంటిమని యుగ్గడించిరి.

నిజముగా ననన్యభక్తులు భగవద్విషయమున వ్యాముగ్ధులై యుందురు. కామక్రోధాది యరిషడ్వర్గమును జయించి విషయవిరక్తుడై, నిర్మూలిత కర్ముడైన మునిముఖ్యుడు (జ్ఞానభక్తుడు) శ్రీ హరిని దర్శింపగలడు.

'భక్త్యా లభ్య స్త్వనన్యయా' ఏకాంత భక్తిచేత మాత్రమే లభ్యపడుదునని భగవానుని వాక్యము అట్టి భగవద్దర్శనమును గోరు కులశేఖరులు తాము రచించిన ముకుందమాలతో, "మాద్రాక్షం క్షీణపుణ్యాన్ . . ." "జిహ్వే కీర్తయ. . "ఇత్యాది రెండు శ్లోకాలలో తామేది చేయగూడదో, మరి యెట్లుండవలెనో నిర్ణయించుకొని, తమ జ్ఞాన కర్మేంద్రియములను శాసించుకొనిరి.

తమయందు వాత్సల్యమును ప్రకటించు రంగనాథుని విషయముననే ఎక్కువ వ్యామోహము కలవారు గావున నీ భాగమున, తటిల్లత వలె క్షణభంగురములైన యిహ భోగములందు మునుంగుచు, శ్రీ రంగేశుని పాదపద్మములకు నమస్కరించుటకు నిచ్చగింపని, ధూర్తులగు ప్రాకృత మానవులతోడి సాంగత్యమును నిరసించుచు, శ్రీశుని యెడ, నేకాంత భక్తి గలవాడనని చెప్పుకొనిరి. గ్రాసవాసాది ఐహికవాంఛలుగల ప్రాకృత మానవులు తమకు ఉన్మత్తులుగా దోచిరి. కాని మరి తానే వారి దృష్టిలో "నేనే పిచ్చివాడనుగా మిగిలిపోయితిని' అని వెనుకటి భాగమున దెల్పిరి. తాము 'భగవంతుని విషయమున నున్మత్తుడనే'యని యంగీకరించుట యీ దశకమునందలి విశేషము.

ఈ సందర్భమున ఆళ్వారులు శ్రీ శుకమహర్షి చరిత్రమును జ్ఞప్తికి తెచ్చుచున్నారు.

శ్రీశుకుడు విజ్ఞానమూర్తియై బ్రహ్మభావమున నుండి, వృథా ప్రపంచమును చేరనివాడు.

దైవగతి చేరిన లాభము జూచి, తుష్టుడై నేరని వాని చందమున నేర్పులు చూపనివాడు శుకయోగీంద్రుడు.

ఆ:వె. వెఱ్ఱి తనము మాని విజ్ఞానమూర్తియై
బ్రహ్మభావమునను పర్యటింప
వెఱ్ఱి యనుచు శుకుని వెంట నేతెంతురు
వెలదు లర్భకులును వెఱ్ఱులగుచు.

ఈ విధముగా శ్రీశుకుడు లోకులహృదయములందు వెఱ్ఱివాడుగా నిలిచినట్లు శ్రీమద్భాగవతమున చదువుదుము.

చక్రాయుధధారియగు శ్రీరంగనాథుని చరణయుగళియందు లగ్నమైన మనస్సుకలవారలై లోకవిలక్షణులై వెఱ్ఱివాడుగానుండిన చేరదేశ ప్రభువగు కులశేఖరు లనుగ్రహించినవి యీ పాశురములు (పద్యాలు). ఈ సూక్తులను చదువువారికి తప్పక భగవద్భక్తి కలుగ గలదని ఆళ్వారులే సెలవిచ్చిరి.

## నాల్గవ దశకము

ఈ దశకమునందు ఆళ్వారులు శ్రీవేంకటేశ్వరుడు వేంచేసియున్న శేషశైలముతో నిత్యసంబంధముగల యెట్టి జన్మ తమకు లభించినను (స్థావర జంగమాత్మకమైనది) తరింపవచ్చునని భావించిరి. ఈ విధముగా ఆళ్వారుల భక్తి వినూత్న భావమున రూపొందినది.

ఆళ్వారులు విజ్ఞానమార్గమున పరిశుద్ధమైన తమ ఆత్మ పరమాత్మను దర్శించి సేవింపవలయును అను ఆశయమును గూడ వదలివైచిరి. పరమాత్మయెడ భక్తిప్రపత్తులను వదలుకొనిరి. వేంకటేశ్వరుని ముఖసందర్శన భాగ్యము నిత్యమును తమకు లభ్యమగు జన్మమెట్టిదియైన, నదియే తమకు పరమావధిగా భావించిరి. అది లభింప నున్నయెడల సప్తగిరిపై నెట్టి జన్మము లభించినను సరియే యని యనుటలో వారి భక్తి యెంత పరాకాష్ఠకు చేరినదో తెలియగలము.

శ్రీనివాసుని నిత్యనివాసమునకు నోచుకొనిన, పరమపవిత్ర పర్వత రాజమున నేదో రూపమున, పరమాత్మసన్నిధానమున వసించియుండుటయే లక్ష్యముగాగల యాయన మాంస సంవర్ధితమైనదియు, నిత్యనివాసమునకు అనుకూలపడనిదియునగు మానవజన్మము తమకు వలదని దానిని నిరసించుకొనిరి.

ఏ రూపముననైనను వేంకటాద్రితోడి నిత్యసంబంధమును కలిగియుండు స్థితికి, దేవేంద్రాది పదవులును, రాజ్యాధికార వైభవములును సాటిగావనిరి. ఆ యద్రీంద్రమున నున్న పుష్కరిణిలో ఒక జన్మమెత్తుట మంచిదనిరి. లేనిచో, దానికాహారమగు చేపగా జన్మించినను తగుననుకొనిరి. ఇట్లే స్వామికి అంతరంగ కైంకర్యమునకగు బంగారుపాత్ర ధారిగానో, భక్తుల పాదధూళితో నిండిన మార్గముగనో స్వామికెదుట నుండు మెట్టుగనో జన్మించిన బాగుండునని భావించిరి.

పై విధముగ తాము కోరుకొనిన జన్మములలో, ప్రతి దానికిని ఏదో యొక ప్రతిపత్తి కానవచ్చినది.

"భక్తపరాధీనుడై, వారి హృదయ పద్మములందే సదా నెలకొని, వారి యభీష్టసిద్ధిని, యోగక్షేమములను వహించు శ్రీనివాసునికి, తనహృదయము గోచరముకాకుండునా? కావున స్వామికి, కొండమీద తా నే వస్తువుగా జన్మించిన తగునో, అది ఆయనయే నిర్ణయించి, తమకట్టి నిత్యనివాసమునకు తగిన జన్మము నొసంగుమని ఆయనను వేడుకొందును. అదియే జన్మమునకు ధన్యత్వమని యెంచుకొందును" అని వచించుచున్నారు.

ఇదియంతయుగాంచిన, ఆళ్వారుల మనస్తత్త్వము విలక్షణమైనదిగా గానవచ్చును. సోపానపురాయిగా జన్మించియైన నిత్యమును స్వామి దర్శన భాగ్యము గలుగుటనే మోక్షముగా నమ్మి అట్లు కోరుకొనిరి. రక్తమాంసాదులతో నిండి చంచలమైన మానసిక ప్రవృత్తితో గూడిన నరజన్మము, స్వామి దర్శనము స్థిరముగా చేయజాలనిది, హేయమైనది అని భావించుటతో వారి భక్తి కిది పరాకాష్ఠ.

ఈ సందర్భమున ఆయన, భాగవతమున వర్ణింపబడిన గోపికలను స్ఫురణకు తెచ్చుచున్నారు.

బృందావనాంతసంచారియై, లీలామానుషవిగ్రహుడైన శ్రీకృష్ణ పరమాత్మయెడ, అనన్యార్హ భక్తిప్రపత్తులను ప్రకటించుచు, సమస్త విధముల స్వామి దర్శన, సంశ్లేషాది క్రీడలకు నోచుకొనిన గోపికలు దైవికమైన పరమానందము ననుభవించువారలై, శ్రీకృష్ణ దర్శనమునకు బయలు దేరి పోవుచు దారిలో తమలో తాము "తమ లోచనముల కలిమికి ఫలము శ్రీకృష్ణుని జూడగలుగుటింతియసుండీ" అనుకొనుచుండెడివారు.

కొందరు గోవిందు నుద్దేశించి 'గోపాలకృష్ణుని కెమ్మోవిసుధా రసంబు గొనుచున్ చోద్యంబుగా మ్రోయుచున్ నిరంతరంబు నాతని నెడ బాయ కుందునట్టి, తపంబుచేసిన వేణువు జన్మము ధన్యమైన' దని ప్రసంగించు కొనుచుండిరి. 'కాళిందీ తటమున వేణువుగా భువిని జన్మించు నదృష్టము నకు నాపూర్వ జన్మమున ఏ నోమును నోచనైతినిగదా! అట్లు నోచు కొనినచో, నీ జన్మమున వేణువునై యుండిన మాధవాధర సుధాపానంబు పుష్కలముగా లభించి యుండునుగదా! కాళిందీ కూలంబున ఈనంద సుతుని యధరామృతముం గ్రోలెడి వేణువనగు నో మేలాగున నోచవచ్చు నెరిగింపగదే --' అని యొక గోపభామిని, మరి యొకతె నడిగెడిది.

ఇట్లువారు శ్రీకృష్ణునియందు ఆసక్తములైన మనోవ్యాపారములు గల వారై, తమలో తాము ప్రసంగించుకొనుచు, శ్రీకృష్ణవియోగము నెంత మాత్రమును చెందని వేణువు జన్మము, తమ జన్మలకంటె ధన్యమైనదని భావించెడివారు.

శ్రీకృష్ణుడు చాణూరమల్లునితో పోరునపుడు, ఆతని దివ్యమంగళ విగ్రహమును, లోకమోహన రూపమును గాంచిన పౌరకాంతలు కంసుని యకృత్యమును నిందించిరి. శ్రీకృష్ణుని పరమాత్మగా దర్శించిరి. ఆ సందర్భమున వారును గోపికలవలెనే--

'శ్రీకృష్ణుని వేణువుగా, ధరించు పీతాంబరముగా, అలంకరించు కొను వైజయంతిగా, జన్మము నెత్తగలుగుట ధన్యమైనదని' యనుకొనిరి.

"శ్రీకృష్ణుని విహారమున కనువై, తత్పాద స్పర్శనములచే పవిత్రమై తనరు బృందావనమున, తరులమైన కృష్ణుడానందమునజేరి క్రీడసల్పు."

"అట్టి జన్మము లెత్తు నోములను తమ పూర్వజన్మములందు నోచ మైతిమి గదా"యని వాపోవసాగిరి.

అట్లే ఆళ్వారులును నిరంతరమును శ్రీవేంకటేశ్వరుని నిత్య నివాస భూమియైన పర్వతరాజముయొక్క జన్మము ధన్యమైనదనియు, అందు తమ కే రూపముతో గూడిన జన్మమైనను శ్రీశుడు లభింపజేసిన యెడల భగవద్వియోగము తమ కెంత మాత్రమును కలుగదని భావించుటలో, వారిభక్తి, గోపికలకుగల పవిత్రభక్తివంటిదని గ్రహింపగలము.

శత్రుసంహారమును చేయు వేలాయుధముగల కులశేఖరాళ్వారులు స్థిర ముగా చల్లని జల్లులుగలదియగు వేంకటాద్రియందు వేంచేసి యున్న, దేవుని బంగారుమేలిమిగల అరుణపాదపద్మములను నిరంతరమును సేవించుటకై ఆశించి మ్రొక్కి అనుగ్రహించిన యీ దశకమును నేర్చిన వారు స్వామికి ప్రీతిపాత్రులగుదురు అని యుద్ఘాటించిరి.

## అయిదవ దశకము

సర్వజగద్రక్షకుడైన శ్రీమన్నారాయణుడే పరబ్రహ్మ. ఆ పరమాత్మకే చెందినవాడు జీవుడు. పరమాత్మచేతనే రక్షింపబడువాడు. పరమాత్మకే పరతంత్రుడు. పరమాత్మతో విడదీయుటకు వీలులేని సంబంధము గలదియే జీవాత్మ. పరమాత్మను పొందుట కుపాయము (సాధనము) నిరంతరభక్తి.

శ్రీమన్నారాయణుడు గాక, తమకు వేరుశరణ్యములేదని నమ్మిన కులశేఖరులు మలయాళదేశమునగల 'తిరువత్తువక్కోడు' స్వామి సన్నిధిని దర్శించి సర్వవిధ రక్షకుడగు శ్రీమన్నారాయణుని సేవించిరి.

ప్రపన్నానీకరక్షామణియైన నారాయణుడే తప్ప తనకు వేరు శరణ్యము లేదని, స్వామి నారాధించుచు, నాయన పదపద్మముల నీడను నిల్చి, పరమాత్మకును జీవాత్మకును గల సంబంధమును దృష్టాంతపూర్వకముగా వివరించుచు చెప్పినవి ఈ భాగమునందలి పద్యములు.

పరమాత్మకును జీవాత్మకును గల సంబంధము—

(1) తల్లికిని బిడ్డకునుగల సంబంధమువంటిది. (2) విడదీయరాని పతిపత్నీ సంబంధమువంటిది. (3) ప్రభువునకును ప్రజలకును గల సంబంధమువంటిది. (4) వైద్యునికిని రోగికిని గల సంబంధమువంటిది. (5) సముద్రముమీద పయనించు ఓడకును, సముద్రమును దాటుటకు యత్నించు పక్షికిని గల సంబంధము వంటిది. (6) ఉదయభానునకును పద్మమునకును గల సంబంధమువంటిది. (7) కాలమేఘమునకును పైరునకును గల సంబంధమువంటిది. (8) సముద్రమునకును అందు చేరు నదులకును గల సంబంధమువంటిది. (9, 10) పరమాత్మ స్వామి. జీవాత్మలు వాని సొమ్ములు. పరమాత్మ తిరస్కరించినను జీవాత్మ పరమాత్మకే యెప్పుడును చెందియుండునట్టి సంబంధము కలది.

పై విధముగా వివరించి అట్టి యనుబంధము స్వామికిని తనకును లభింపవలయుననియు, అయ్యది స్వామి పరిపూర్ణకటాక్షము వలననే లభ్యము కాగలదనియు భావించి, శ్రీహరిని ఆళ్వారులు ప్రార్థించిరి.

భగవంతుడు స్వామి. జీవాత్మలు వాని సొమ్ములు అను స్వస్వామి సంబంధము ఇందు సూచితము.

నీవు నన్ను ఉపేక్షించినను, వేరే యెవరిని శరణు చొరను అని భగవంతుని చరణములందే ఆశగొని కులశేఖరు లనుగ్రహించిన యీ పాశురాలను అనుసంధింపగలవారు, ఘోరపాపములు చేసినప్పటికిని నరకమును పొందరు.

## ఆరవ దశకము

మధురభక్తితత్త్వము ననుసరించి చూచిన పరమేశ్వరు డొక్కడే పురుషుడు. తదితరమైన చరాచరాత్మకమగు జగత్తు అంతయు స్త్రీ ప్రాయము నగును.

ఇందు భక్తునికిని భగవంతునికిని గల సంబంధము తొమ్మిది విధములుగా నుండును. వానిలో భార్యాభర్తల సంబంధము వంటిది ఒకటి.

భగవద్భక్తిని శృంగారముగా మార్చుకొనిన వారికి ఉపాస్య వస్తువు పురుషుడుగను, తాము స్త్రీలుగను అనుభవమునకు వచ్చునందురు.

శ్రీమద్భాగవతమున, ఉత్తమజ్ఞానులయొక్క అనన్యభక్తిని గూర్చియు దాని ఫలితమును గూర్చియు, శ్రీకృష్ణచారిత్రమున గోపికాఘట్టమున విపులముగా వివరింపబడినది.

భక్తులగు జిజ్ఞాసువులు గోపికలుగా, అనగా స్త్రీ విశేషములుగా, పరాత్పర భావమును పొందిన శ్రీకృష్ణుడు పరమపురుషుడుగా వర్ణింపబడెను. ఈ విధముగా మధురభక్తితత్త్వము ప్రదర్శింపబడినది --

నందవ్రజమున శ్రీహరి, శ్రీకృష్ణుడుగా నవతరించి, జారుడు, చోరుడు, విటుడు, కితవుడు గానయి ఆశ్చర్యజనకములగు వివిధ మాయా లీలలను ప్రదర్శించెను. ఇవి యన్నియు గోపికలలోని ప్రణయభక్తిని ఉద్దీపింపజేయునవి.

యోగేశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణుడు వేణుగానము చేయుగా, గోపికలు, గానాకృష్టలై, తాము చేయుచున్న పనులను ఎక్కడివక్కడ వదలి, ఆతని దర్శనార్థమై వెడలిపోవుదురు. శ్రీకృష్ణ దర్శన, స్పర్శన సంశ్లేషాది సౌఖ్యమున, అపూర్వమైన మోక్షానందము ననుభవింతురు. కొంతకాల మట్లు వారితో క్రీడించి, వారిని పరమానందమున ముంచి, ఆత డంతలోనే మాయమగును.

ఆ సందర్భమున గోపికలు బృందావనమునంతయు వెదకి కృష్ణునిగానక, వియోగభారమును సహింపలేక, ఆతని మాయాచేష్టలను వర్ణించుచు, తలంచుచు నుండిపోదురు. ఆ స్థితిలో కొందరు

"నీవు యశోద బిడ్డడవె నీరజనేత్ర ! సమస్త జంతు చే
తో విదితాత్మ నీశుడవు, తొల్లి విరించి తలంచి, లోకర
క్షావిధ మాచరింపుమని సన్నుతిసేయగ సత్కులంబునన్
భూవలయంబుగావ విటు పుట్టితిగాదె మనోహరాకృతిన్."

అని అనుకొనసాగిరి.

"చరణసేవకులకు సంసారభయమును
బాపి, శ్రీకరంబు పట్టుగలిగి
కామదాయిమైన కరసరోజంబును
మస్తకముల నునిచి మనుపు మీశ!"

"మగువల యెడ నీక్రౌర్యము
తగునే నిజభక్త భీతిదమనుడ వకటా!
తగదు భవద్దాసులకును
నగుమొగముం జూపి కావు నళినదళేక్షా!"

అనుచు వాపోవుదురు. ఇట్లే యెన్ని విధములుగానో పలుకుచుండగా జగత్ప్రాణుడు త్రైలోక్యమోహనుడై, మన్మథమన్మథుడై, మనోజ్ఞాకారియై, హారియై, ఘనపీతాంబరధారియై, తత్కాంతాసమీపమునకు వచ్చును.

అంత వారికి ప్రాణములు లేచివచ్చును. వికసితవదనారవిందలగుదురు. వారిలో నొకతె భక్తితో నంజలి గావించి ప్రాణేశుని కెంగేలు పట్టుకొనును.

'భామ యొకతె భ్రుకుటిబంధంబుగావించి
ప్రణయభంగ రోషభాషణమున
దష్టరదనయగుచు దండించుకైవడి
వాడి చూడ్కిగముల నరుని జూచి,

తలగి పోవుటట్టి తప్పేమి చేసితి
నధిప పలుకు ధర్మ మనియె నొకతె
ఏమి నోము ఫలమొ హృదయేశ నీ మోము,
మరలగంటి ననుచు మసలె నొకతె."

మరి కొందరు.

హరి సురుచిర లలితాకృతి
తరుణులు గని ముక్తవిరహ తాపజ్వరలై
పరమోత్సవంబు సలిపిరి
పరమేశ్వరు గనిన ముక్త బంధుల భంగిన్.

ఇంకను కొందరు, నిరంతరము శ్రీకృష్ణుని భక్తితో ప్రేమించు గొల్ల పడుచులు, ఆతని మాయచేష్టలకు అసంతృప్తిని గనపరచుచు, కుపితలై, వియోగ భారము నోర్చుకొనలేక పరితపించుచు ప్రణయ రోషముతో నాడళ్లు మరచి నిందింపసాగిరి. తమయం దాతనికి ప్రేమయే లేదని యెత్తిపాడిచిరి.

ఇష్టవస్తుప్రాప్తి కెడబాటు సహింపలేని వారై, నిందాగర్భితముగా నున్న వారి వాక్యములు ప్రణయభక్తితో గూడినవే.

తన యెడ ననన్య భక్తి ప్రపత్తులు గల గోపికలకు తాను కల్పించిన వియోగ దశకు కారణముగా శ్రీకృష్ణుడు

చెలువల్ దవ్వులనున్న వల్లభులపై చిత్తంబుల గూర్చు రు
త్కలికన్ చేరువ వారికంటె, వదియుం గా కెప్పుడున్ నన్ను మీ
రలు చింతించుచునుండ గోరి యిటు దూరస్థత్వమున్ బొందితిన్
తలకంబోలదు నన్ను గూడెదరు నిత్యధ్యానపారీణలై.

పగనైన వగనైన వారలు నిత్య ధ్యానపారీణలై తనను గూడుట తథ్యమనును.

అనన్యధ్యానతత్పరలైన గోపికలు ప్రణయభక్తి భావమున పరమాత్మ యగు శ్రీకృష్ణుని సంశ్లేషము ననుభవించుచు, నానందమగ్నలగు చుండిరి. ఏమాత్రము విశ్లేషము గలిగినను సహింపలేనివారై ప్రణయరోషముతో నిందించుచు, నాతని యెడ నిరంతర ప్రేమను (భక్తిని) అధికము చేసికొనుటయే జరిగి, భగవంతునికి మరింత ప్రీతిపాత్రలేయ్యెరి.

ప్రణయభక్తి సమన్వితలైన అట్టి గోపికల మానసికతత్త్వమును ఆళ్వారులు తమయం దారోపించుకొని శ్రీహరిని అనుభవించుట భగవదనుభూతి నందుట - ఈ దశకమునందు కాననగును.

ఇది కొంత విలక్షణముగనే ఉండును. కాని నిరంతర భగవదనుభూతిగల భక్తుడు, భగవద్విశ్లేషమును ఈషణ్మాత్రమును సహింపలేని భ్రాంతిలో పడిపోవుట సహజము. ఈ విధమగు మధురభక్తి గీతగోవిందమున విపులముగా ప్రదర్శింపబడినది.

కులశేఖరుల వలెనే 'తిరువాయిమొళి'లో నమ్మాళ్వారు తమ షష్ఠశతకములో రెండవదశకమున దేవుని భర్తగా తనను భార్యగా భావించుకొని తన కడకు భగవంతుడు రాగా, తన గుమ్మము కడనే నిల్పి, 'నీ ప్రీతికి పాత్రులైన వారి యొద్దకు పోక ఇటకేల వచ్చితివి? అటకేపొమ్ము' అని

తలుపు వేయుచు ప్రణయరోషమున పలుకుచు రచించిన పాశురములను చదువగలము.

తిరుమంగై యాళ్వారులు దశమశతకమునందలి అష్టమ దశకమునను ఇట్టి ప్రణయ రోషమునే పొందుపరచిరి.

ఇవి యన్నియు భాగవతమునందలి గోపికల మధురభక్తి తత్త్వమును బోలిన రచనలే. ఆళ్వారులందరును తమ మధురభక్తిని ప్రదర్శించియే శ్రీశుని కరుణకు పాత్రులై తరించిరి.

## ఏడవదశకము

జగదధీశ్వరుడగు శ్రీహరి, శ్రీకృష్ణుడుగా దేవకీవసుదేవులకు జన్మించినాడు. పుట్టిన వెంటనే నందవ్రజమునకు గొంపోబడి యశోద యొడిలో నుంచబడినాడు. అదిమొదలు అక్కడనే పెరిగినాడు. లీలామానుష విగ్రహుడైన శ్రీకృష్ణుని బాల్యక్రీడలను యశోదయే అనుభవించినది. అట్టి యదృష్టము కన్న తల్లికి లభింపదాయెను.

కంససంహారానంతరము, శ్రీకృష్ణుడు బలరామునితో గూడి, తల్లిదండ్రులను చెరనుండి విడిపించి, సమీపించి "మీరు మమ్ము కంటిరి. కాని మా పౌగండ, కైశోర వయస్సులలో మమ్ము ఎత్తు కొనుచు దించుచు, ప్రేమతో లాలించుచు నుందు సౌభాగ్యము నందరైతిరి. దైవయోగమున తల్లిదండ్రులచే లాలింపబడుచు, పెరుగుచు, వర్ధిల్లు అదృష్టము మాకును ఇన్నాళ్లును కరవాయెను. నిఖిల పురుషార్థ హేతువైనెగడుచున్న మేనికెవ్వారలాధ్యులు? మీరే కదా! ఆ ఋణమును దీర్ప నూరేండ్లకైనను చనదు. చెల్లుబడి గలిగి యుండియు తల్లిదండ్రులను రక్షింపనివాడు భూమియందు జీవన్మృతుడే యగును.

కంసుడు మా కోసమై మిమ్ములను కారాగారమున బంధించినాడు. అది నివారింప సమర్థులమైయుండియు నింతవరకును జాగు చేసిన మా లోపములను క్షమింపగోరెదము."

అని యిట్లు మాయామనుష్యుడైన శ్రీకృష్ణుడు పలుకగా మోహితులై వారలు బలరామకృష్ణులను తమ యంకపీఠముల నిడుకొని, వారి వదనంబులు కన్నీట దడుపుచు ప్రేమపాశబద్ధులై యుండిరి.

ఆ సందర్భమున పరమాత్మయైన శ్రీకృష్ణుని శైశవ బాల్యదశలను అద్భుతావహములగు మితిలేని చేష్టితాలను, దర్శింపనోచుకొనని దేవకీదేవి శ్రీకృష్ణునితో, తన దురవస్థను దలంచుకొని పలికిన వాక్యము లీ దశకములోనివి.

అళ్వారులు దైవస్వభావయగు దేవకిస్థితిని అనుభవించుచు, ఇందు శ్రీకృష్ణుని శైశవలీలలను వర్ణించినారు.

ఈ దశకమునందు, భక్తకులశేఖరులగు కులశేఖరప్రభువు 'సర్వేశ్వరుని శ్రీచరణములను తమ శిరస్సునకు అలంకారముగా ధరించిన వాడ' నని చెప్పుకొనుట విశేషము.

వీనిని అనుసంధించినవారు వెంటనే శ్రీవైకుంఠమును చేరుదురని అళ్వారులు తెలుపుచున్నారు.

## ఎనిమిదవ దశకము

వేదవేద్యుడగు పరమపురుషుడు, దశరథునికి కౌసల్యాగర్భమున శ్రీ రామచంద్రుడుగా నవతరించినాడు. అట్టి భాగ్యము నొందిన కౌసల్య బాల్యదశలోనున్న శ్రీరామచంద్రుని ఊయెలలోనుంచి, జోలపాటలను పాడుచు, లాలించుచు ఊచి నిద్దుర పుచ్చెడిది.

'రామా నా హృదయమే ఒక ఊయలగా నమర్చితిని. దాని నలంకరించి శయనింపుము. నీకు జోల పాడెదను' అని మొదలిడి, కౌసల్యానందవర్ధనుడైన, శ్రీరాముని కళ్యాణగుణములను, తదవతార ప్రయోజనమును వర్ణించుచు, పరమభోగ్యుడైన శ్రీరామచంద్రుని, తల్లియైన కౌసల్య యనుభవించిన రీతిని, కులశేఖరాళ్వారులు, ఆ పరమాత్మ ననుభవించిన విధము ఈ దశకమునందలి విషయము.

తిరుక్కణ్ణపురస్వామిని దర్శించి సేవించినపుడు అళ్వారులు తమ మనస్సులో నిట్టి యనుభవమును పొందుట తటస్థించినది.

తిరుక్కణ్ణపురము చోళదేశమున గల పుణ్యక్షేత్రములలో నొకటి. ఇచ్చట శౌరిరాజ స్వామిని సేవించినవారు వీరే కాక, నమ్మాళ్వారు, తిరుమంగై యాళ్వారు, పెరియాళ్వారు, ఆండాళ్లు అనువారును గలరు. వీరందరును ఆ క్షేత్రమునకు మంగళాశాసనమును గావించిరి.

ఈ పాశురములను (పద్యములను) భక్తితో పఠించువారు భక్తి తత్పరు లగుదురు.

## తొమ్మిదవ దశకము

శ్రీమహావిష్ణువు శ్రీరామచంద్రుడుగా నవతరించి, పితృవాక్యపరిపాల కుడై అడవుల కేగెను. ఆ యెడబాటును క్షణకాలమైనను సహింపలేని, వృద్ధుడును, మహనీయ పరాక్రమశాలియునైన తండ్రి దశరథుడు విలపించుచు నాడిన మాటలను ఆళ్వారులు, ఆ దశరథుని యప్పటి స్థితిని తాము బొందినవారై, ఈ దశకమున వర్ణించిరి.

కరుణరస భరితములైన యీ విలాపవాక్యములు చదువు వారి హృదయములు ద్రవీభూతములై కన్నులు చెమర్పకుండ నుండలేవు.

వీనిని అనుసంధించినవారు మంచి నడవడి కలవారగుదురని యాళ్వారుల భావము.

## పదవ దశకము

అవతారపురుషుడగు శ్రీరామచంద్రుని చరిత్రమును వాల్మీకి వర్ణించి యనుభవించిన విధముగా, ఆళ్వారులు ఈ దశకమున వర్ణించి యనుభవించుట కాననగును.

ఏడుకాండలలోను వర్ణింపబడిన రామకథ యిందు సంగ్రహముగా పొందుపరుపబడినది. ఇది యంతయు నొక విధముగా సంక్షిప్త రామాయణముగా నున్నది.

చిల్లై తిరుచ్చిత్తరకూటమున స్వామి యగు శ్రీరామచంద్రుడు హనుమంతునితోగూడ నిత్యనివాసము చేయుచుండును. ఆ క్షేత్రమును దర్శించిన ఆళ్వారులు సంగ్రహముగా రామాయణగాథను ఆనతిచ్చిరి. ఈ సూక్తిని అనుసంధించినవారు సర్వేశ్వరు ననుగ్రహముచే పరమపదమును ప్రాపింతురని ఫలమును చెప్పినారు.

శ్రీ రామావతారమునందు మిగుల ప్రవణులై యుండిన కులశేఖరులు ఈ దశకమున తమ హృదయమును పూర్తిగా నావిష్కరించిరి.

శ్రీరామచంద్రునికి మ్రొక్కుకొను భక్తుల చరణయుగళినే మ్రొక్కు కొందుననినారు. అనగా శ్రీరామభక్తుడు భరతుడు. భరతునికి భక్తుడు శత్రుఘ్నుడు. ఆ శత్రుఘ్నునివలెనే భాగవతదాస్యముచేయుట కాత్రపడు చుంటిని అనిరి.

క్షేత్రమున వేంచేసిన శ్రీరామచంద్రుని సేవించు భక్తవరులకు నిత్య సూరులును సాటిగారనియు, అట్టి భక్తవరుల పాదముల మహిమనే తాము స్తుతింతుమనియు దెల్పిరి.

క్షేత్రస్వామి యగు శ్రీ రామచంద్రుని చరణముల తలదాల్చుట యను రాజ్యమునే కోరుకొందును గాని వేరురాజ్యమును కోరననిరి. అనగా శ్రీరామచంద్రుని చరణములను శిరోభూషణముగా దాల్చుటే తమకు మహాసామ్రాజ్యమని యాయన భావించిరి.

తాము రచించిన ఏడవదశకమున కూడనిట్లే సర్వేశ్వరుని శ్రీచరణ ములను తమ శిరస్సునకు అలంకారముగా ధరించినవాడను అనిరి.

* * *

# పెరుమాళ్ తిరుమొళి

## I

ఈ దశకమునందు, ఆళ్వారులు శ్రీరంగనాథుని సేవించుటలో తమకు గల యుత్కంఠను వెల్లడించుచున్నారు.

తే. వేయిపడగల రత్నాల వెల్గుఁ జిమ్మి
అంధకారము తొలగించు నాదిశేషు
పాన్పుగాఁగొని పవళించు పద్మనేత్రు,
నెపుడు నా నేత్రములు గాంచియుండుఁగలనొ. 1

సీ. ప్రాకార సప్తక పరిరక్షితంబైన
శ్రీరంగధామ సుక్షేత్రమందు,
శాత్రవాపాయంబు శంకించి, విషవహ్ని
పూలమేల్కట్టునా, పొలయఁజేసి
వేనామముల, సదా వేనోళ్ల నినుతించు
ధవళవిగ్రహుఁడుగా తనరిమించి
సేవింపనేర్చిన శేషాహి, పాన్పుగా
రాణింప, శయనించు రంగనాథు,

తే. పరము, నతసీకుసుమశోభ వరలువాని,
నమిత సద్భక్తిఁ గొండాడ నమరునెపుడొ
నిలచి యామోద సుస్తంభములను బట్టి
కన్నులారంగ కాంచఁగాఁ గలుగునెపుడొ. 2

చ. నలువ తదేక దృష్టినెయి నాలుగుమోముల సన్నుతింపఁగా,
చెలువుగ శేషశాయి యయి, సేవలఁదేర్చెదు భక్తకోటికిన్
అలరి, దయార్ద్రదృష్టి నభయంబు నొసంగెడు రంగనాథు, నే
నలరుల తత్పదాబ్జముల, నర్చనసేయుచుఁ గాంచునెప్పుడో! 3

సీ. కెరలు రక్కసుఁడైన కేశి శిరంబును
ఖండించి మోదింపఁగలుగువాని,
కేల గోవర్ధనగిరి నెత్తి, గోవుల
గోపబాలురఁ గాచికొన్నవాని,

నీల మాణిక్యంపు నిగనిగల్ వెలుగొందు
వద్ధికాంతుల దేహమలరువాని,
ద్రావిడామరవా గ్ద్వితయ వేదవీథుల
నడయుంగఁ గననచ్చునట్టివాని,

తే. రంగనాథుని, హృదయాంతరంగనాథు
పదము లరమోడ్పుఁగనుదోయి భక్తివశత
నెపుడు గాంతునో! సుమరాజి నేర్చికూర్చి
చేతులారంగ నర్చించు చెలువమెపుడొ! 4

ఉ. నారదతుంబురుల్ నిగమనాదములన్ శ్రవణైకసౌఖ్యవి
స్తారముగాఁగ వీణెల నుదారముగాఁ బలికింప, భక్తమం
దారుఁడు, రంగనాథుఁ డహితల్పుఁడుగా శయనించియుండ, నిం
పారఁగఁ గాంచి, మ్రొక్కుకొనునంతటి భాగ్యమదెన్నఁడౌనొకో? 5

చ. సురభిళ సన్మధు స్థగిత సుందర పుష్ప వనావృతంబయై
నరగెడు మందిరంబున, తపస్వులు, నచ్చరలున్ మహేంద్రుఁడున్,
హరుఁడు, విరించియున్, ప్రసవహారములన్గయిసేసి కొల్వఁగా
నరలెడు రంగనాథు ముఖపద్మము నేఁ గను భాగ్యమెప్పుడో? 6

చ. మనసున పాపముల్ గెడపి, మాన్యత నింద్రియముల్ జయించి, స
జ్జనమత సంప్రదాయమున సారపు ధర్మపథాన నేర్మి గాం
చిన నిరవద్య భక్త గణ చిత్త వశీకృతుఁడైన రంగ నా
థునిఁగని, సమ్మదాశ్రువుల తోరపు భక్తినిఁ గొల్చుటెప్పుడో? 7

మ. వరిచేలున్ కుసుమాభిరామవనముల్ వ్యాపింప తన్మధ్యమం
దురు శ్రీరంగపురైక హర్మ్యమునయం దుత్కంఠమై దేవతల్,
వరుసన్ తార్క్ష్యుఁడు, స్వీయరక్షకగు నాపంచాయుధంబుల్ సదా
పరివేష్టించెడు రంగనాథుఁ గని, నే ప్రార్థించు టే వేళనో! 8

శా. తోరంబైన సముద్ర ఘోషనలనై తూర్యధ్వనుల్ నిండఁగా,
శ్రీరంగంబునయందు, సౌధమున, నాసింగాంచు భక్తాళితో
శ్రీరంగాధిపు కీర్తి సాశ్రునయన శ్రీదీప్తి నిండార, నో
రారన్ గానము సేయుచున్ భువిని నాట్యంబాడుటే నెన్నఁడో? 9

సీ. స్వర్గాదిలోకముల్ సకలబృందారకుల్
విమలసౌఖ్యస్థితిఁ వెలయు కొఱకు,
భువి మానవులతోడ పుణ్యప్రవృద్ధమై
మెలఁగి యుజ్జీవింపఁగలుగు కొఱకు,
అఖిల దుఃఖోదర్కమైన యంభోరాశి
మాచముట్టుగ మాడ్చివైచుకొఱకు,
నిర్భరానంద సందర్భవైభవముతో
పరమభక్తాగ్రణుల్ పరగు కొఱకు,

తే. దక్షిణాశాభిముఖముగ, ధాత్రియందు
శేషశాయిగ వెలసిన శ్రీసనాథు
పదములంగొల్చి, తద్భక్తవరులగోష్ఠి
కెఱిగి, వారలఁగలియుట యెప్పుడగునొ? 10

## II

ఈ దశకమున, శ్రీరంగనాథుని సేవించు భక్తవరుల వైభవమును కొనియాడుచు, వారికి సేవకుడుగా నుండు నదృష్టమును ఆళ్వారులు కోరుకొనుచున్నారు.

సీ. స్వీయప్రయత్నంబుచే నందఁగోరెడు
నట్టివారి కలభ్యమైన వాని,
తనపూర్ణ తేజంబు తానయ్యె భక్తుల
మధురానుభూతికై మలచువాని,
అమ్లానవనమాల అమరంగ యురమున
శ్రీసనాథుండు గాఁ జెలఁగువాని,
శ్రీరంగమున యందు శేషాహితల్పుఁడై
భక్తకల్పకముగాఁబరఁగువాని,

తే. నామసంకీర్తనంబుల, నతుల నుతుల,
భక్తితన్మయ చిత్తవిభ్రాంతి మెఱయు
భాగవతగోష్ఠినిం గాంచి, ప్రణతు లిడుట
అరయు, కన్నులు సాఫల్య మందుటగును.

సీ. వ్రేపల్లె గో, గోప, గోపీజనంబుల
గావంగ కృష్ణుఁడై గ్రాలువాని
శరమొక్కటింబట్టి సప్తసాలంబులఁ
బడఁగొట్ట రాముఁడై పరఁగువాని,
క్షీరాబ్ధిమథియింప చెలువమ్మై పుట్టిన
సిరిని చేపట్టిన చెలువు వాని,
శ్రీరంగపురవర క్షేత్ర రాజంబున
ఫణి తల్పమునయందు వరలువాని,

తే. రంగనాథునిఁ, గొండాడు ప్రాజ్ఞ భక్త
పదసరోజ ధూళిని మున్గువాఁడ; నాకు
ప్రథిత గంగాస్రవంతీ తరంగములను
మునుకవెట్టంగ పనియేమి యనెద నేను. 2

సీ. వీలను పెండ్లాడు నిర్మలోత్సవవేళ
ఏడెద్ల పొగ రణఁగించువిధము
బలిగర్వమునుమాన్ప పనిఁబూని పుడమిని
కొలిచినప్పటి దృశ్యకలిత విధము
సంద్రంబులోమున్గ సకలంబు పుడమిని
అవలీలపైకెత్తినట్టి విధము,
అరయుచున్ భక్తాళి, యనతారమహిమంబు
తలఁచి, దేవళమును వలనుగొనుచు,

తే. అమితహర్షపులకిత నేత్రాశ్రుధార
జార్చుచుంద్రు కావేర్యోఘ సరణిమెరయు;
అట్టి శ్రీరంగనాథ భక్తాంఘ్రి ధూళి
వాడు ఫాలాన పోకి న వ్వాదుకొనుత ! 3

మ. పెరుఁగున్, వెన్నయు, క్షీరముల్ వరుసగా వ్రేపల్లెలో మ్రుచ్చిలన్
భరితక్రోధమునన్ యశోద తనయున్ బంధింపఁగా త్రాట, త
త్పురమున్ కృష్ణునిఁ గాంచి మ్రొక్కు లిడుచున్ ప్రార్థించి, నారాయణా!
వరదా! యంచు నుతించు భక్తవర దివ్యత్పాదముల్ గొల్చెదన్. 4

ఘోరంపుటాకృతి ఘోషించు సప్తపుం
గవముల యుద్ధుర గర్వ మణఁచి,
నీలాంబహృదయాబ్జ నిలయహారివిహార
సుఖమరందముగ్రోలి చొక్కువాఁడు;
కాళీయ ఫణిఫణాగ్రమున నిర్మథన నా
ట్యంబాడి, తద్వధకైన వాఁడు,
ప్రాకార పరిరక్షఁబరఁగెడు శ్రీరంగ
హర్మ్యాన శయనించునట్టివాఁడు
అయిన శ్రీరంగనాథుని, యనవరతము
తమదు హృదయాల నెలకొల్పి, ధ్యానపరత
హర్షపులకిత గాత్రులౌనట్టి భాగ
వతులఁ గొల్చెద నెమ్మది భక్తివశత! 5

అపరిచ్ఛేద్యుని, సృష్టికాద్యుఁబ్రళయుంబైనట్టి కాలంబునం
దపుడున్ నిల్చెడు రంగనాథుని మదిన్ ధ్యానించు భక్తాగ్రణుల్
నిపుణుల్, నాస్తికవాదులం దఘము నేనింద్రోలు పుణ్యాత్ములా
సుపవిత్రాత్ముల, జన్మజన్మముల నే స్తోత్రంబులంజేసెదన్. 6

దివ్యలావణ్యసందీప్తి నిండారంగ,
తనరు మేఘద్యుతి తనువువాని,
ముత్యాలతేజంబు మొనయు హాసద్యుతి,
మురిపెంబుగూర్చు కెమ్మోవివాని,
అడరు కాంతులతోడి వెడఁద వక్షంబున
కౌస్తుభరత్నంబు గ్రాలువాని,
మౌక్తిక దామ సమ్మానితం బగునట్టి,
కంబుకంఠముతోడి కలిమివాని,
అఖిల తేజోమయాత్ముకుండైన వాని,
రంగనాథుని పదపద్మ రమ్యసీమ
పరమమోదాశ్రు లర్పించు భక్తవరుల
పాదముల యందె ధ్యాన తత్పరుఁడ నగుదు. 7

అలికులదీప్తమౌ తులసిహార మురంబు నలంకరింపఁగా
జలజదళాక్షునిన్, భుజగశాయిని, సత్ప్రభు రంగనాథునిన్
విలసిత చారు మూర్తిఁగని, విశ్రుత తాండవ నాట్యశోభలన్
మెలఁగి నుతించు భక్తులను మెచ్చుటలో వివశత్వ మందెదన్. 8

జనులం దెందఱో రంగనాథుని, నమస్కారంబు లర్పించుచున్,
వినుతుల్ సేయుచు, మేనులన్ మఱచి, తద్విఖ్యాతగాథా సుధా
వనధిన్ మున్గుచు దేలుచుండఁగని యవ్వారంద రున్మాదులం
చని లోనెంచెదు వారలే కద, సదా యౌచుందు రున్మాదులై. 9

వనజదళాయతాక్షియగు పద్మినికిం బ్రియుఁడైన రంగనా
థునికి, ననన్య చిత్తముగ, తోరపుభక్తిని సేవసేయఁగా
తనువులు సద్గతింబడఁగ ధన్యత నొందిన, పుణ్యజన్ములన్
మనమున నెంచి, వారలకు మాన్యత నంజలి నే ఘటించెదన్. 10

## III

ఇందు ఆళ్వారులు ప్రాకృతమానవుల సేవను నిరసించుచు, శ్రీరంగనాథుని సేవయందు, తమకుగల వ్యామోహమును వెల్లడించుచున్నారు.

క్షణికమగునట్టి బ్రదుకె శాశ్వత మటంచు
తలఁచు పామరజనులతోఁ గలియలేము;
ప్రథితవత్సలు ననుఁ బ్రోచు రంగనాథు
వినుతిఁ జేసెదు వ్యాముగ్ధుఁ డనుగ నుంటి. 1

రంగనాథుఁ బరాత్పరుఁబ్రస్తుతించు
తత్పరుఁడవౌట వెంత మాత్రంబువలదు,
పద్మనాళమ్ములను బోలు. పడఁతులందు
సక్త కామాంధులగు వారి సఖ్యమెపుడు. 2

మనసిజుని తీవ్ర శరఘాతమునకు లొంగు
చపలచిత్తుల సఖ్యంబు సలుపఁజాల,
నరకఘాతకుఁడైన యనంతు లీల
లను మతించెదు నున్మత్తుఁడనుగ నుంటి. 3

పూతవాస్తవ్యముం గ్రోలి ఖ్యాతి గనిన
ఆ పరంధాము పదభక్తియందు మునిఁగి,
అన్నవస్త్రాల ప్రాప్తికే ఆసపడెడు
ప్రాకృతులతోడి సఖ్యంబు వదలినాఁడ. 4

పరమ సుపవిత్ర మార్గంబు వదలివైచి
దుష్పథంబునఁ బడువారితోడి మైత్రి
కోక నమస్కార, మా శ్రీశునకునె సేవ
భక్తితోఁజేయు వ్యామోహపరత నుంటి. 5

స్వర్గభాగ్యంబులే తృణప్రాయ మనుచు
పరమపురుషుని సేవావివశుఁడ నగుట,
అనుపదం బనన్యప్రయోజనుఁడ నన్ను
పోలక చరించువారల పొందుఁగోర. 6

స్వామి! శ్రీరంగనాథ! యో పరమ పురుష!
ఓ దయానిధీ! యనుచు హర్షోన్మదుఁడను
గాఁగ, నెల్లప్డు కీర్తింపఁగలుగు నాకు
ధూర్త సాంగత్యమున కాంక్ష తొలఁగిపోయె. 7

సకలప్రాకృత మానవసంఘ మెల్ల
నేను తలఁచెద నున్మత్తమైన దనుచు;
ఏల వివరింపవలె, వారి యెడఁదలందు
నేనె యున్మత్తుఁడనుగాఁగ నిలిచియుంటి. 8

చక్రహస్తుని, లక్ష్మీశు, సారసాక్షు,
ప్రథితసౌందర్యనిలయు, శ్రీరంగనాథు,
సర్వవేళల నెమ్మది సంస్మరించి
మఱతు నిహమును, వెఱ్ఱిగా మసలుచుండి. 9

ఫణిశయానుని శ్రీదివ్యపాదపద్మ
కాంతిదర్శన భాగ్యంబు గలుగునట్టి
సుకృతులగువారి కెటనుండి సోకఁగలదు
పేదరికమైన దుఃస్థితి వేదనంబు. 10

## IV

శ్రీవేంకటేశ్వరుని నిలయమైన, పవిత్ర శేషశైలమున నిత్యమును నివసించి యుండుటకు, మానవజన్మమే కాదు, మరి యే జన్మము లభించినను తమకు చాలునని కోరుకొనుచు, ఆళ్వారులు వివరించుచున్నారు.

వరదున్ శ్రీశుని సేవలం దనుపు తద్భాగ్యంబు లేవట్టి యీ
నరజన్మం బురుమాంసవర్ధితమయౌ నాకేల నాశింప ను
ర్వర దీవ్యద్ధ్వన పాంచజన్యధరుఁడై, వాసించు శ్రీవేంకటే
శ్వరు నద్రీంద్రతటాకమందు బకమై జన్మింప శ్రేష్ఠంబయౌ. 1

వరస్వర్గాంగన లెల్లఁగొల్వఁగ, సుఖావాసప్రదీప్తంబయౌ
సురరాడ్వైభవమో, క్షితీంద్ర విభవస్తోమంబొ, ఆశింప, న
శ్వరలభ్యంబులెయ్యైన నేమిఫలమౌ, తర్కింప, శేషాద్రిపై
నురుకాసార బకాన్న మత్స్యమగు జన్మోత్తంసమే కోరుదున్. 2

పురుహూతాభవ పద్మజుల్ మనుజులున్ భూలోక వైకుంఠమౌ
నరుశేషాద్రిని, దేవళావ గుమియై యుండంగ, వర్ణించు త
త్పరివారంబును జేరి, శ్రీశునికడన్ బంగారు పాత్రంబు, నే
వరమౌ భక్తిమెయిన్ ధరింపఁదగు సేవాభాగ్య మాశించెదన్. 3

కనకంబున్ గన దొంగిలించుగుణమే గన్పించునన్ భీతిచే,
వనఘూలంకృత శేషశైలమున పుష్పారామ మధ్యంబునం
దనువౌ చంపక వృక్షమైన జని నే నాశింతు, తత్పుష్పముల్
దనుపున్ సేవల శ్రీనివాసు పదపద్మ ద్వంద్వ పూజావిధిన్. 4

అమరానోకహమున్ హరింపఁడొకొ తా నాశించి కృష్ణుండు, ఏ
విమనస్కుండొ హరించుచంపకము నుద్వేగంబుగా నట్టులే,
సుమనస్స్తుత్య ఫణీంద్రశైలమున నేశోభింతు స్తంభాకృతిన్
అమరేంద్రత్వము నేనిఁ గోర, గిరియం దాశింతు నేజన్మమేన్. 5

వరుసన్ క్షుద్రక్షుపాది నాశనమునే భావింతురట్లాట, నే
గిరిశృంగంబులలోన నొక్కఁడుగ కాంక్షింతుంజనింపంగ,నె
త్తరినేన్ కోరక యీసడింతు సురకాంతాలోక నాట్యంబులున్
పరమోదార తదీయ వైభవములుఙ్భాసించు తత్క్రీడలున్. 6

స్థపతుల్ నూతన దేవతాయతనముల్ స్థాపింపఁగా జాలనే
యుపయోగింతురుగాన, శేషగిరిపై నుద్యన్నదీ రూపమై
సుపవిత్రంబుగ నుండఁగోరెద, నధీశుల్ మెచ్చువైశ్వర్యమున్
అపవిత్రం బది లెక్కసేయఁగదె, తానైవచ్చినన్ జేరినన్. 7

హరదేవేంద్ర విరించులంబలె సదా యజ్ఞంబులం జేయు నం
సరకున్ యజ్ఞఫలంబు లిచ్చెదు పరంధాముండు వాసించు, త
ద్గిరిపై భక్తుల పాదధూళి కనువై దీపించు మార్గంబుగా
పడియుంతున్ జననంబు; నీళ్లునదిలో ప్రాప్తింప వెల్లప్పడున్. 8

అనుకంపామృత మిచ్చి, భక్తజన ఘోరాఘంబులం గూల్తు వం
చని శ్రీవేంకటనాథ ! నిం దలంతు, నీ యావాసపున్ మ్రోల స
జ్జన భక్తామర పాదరేణువుల పూజ్యంబైన సోపానమౌ
జననం బీయుమె, నీ ముఖాబ్జమును కాంక్షల్ దీర కాంతున్ సదా! 9

చారు నవీన రక్త రుచిసాంద్రముగానగు విద్రుమోష్ఠమిం
పారెదు వేంకటేశ ! భవదాయత విశ్రుత శేషశైల మం
దే రుచిరాల్పవస్తువుగనేనియు పుట్టువు నిమ్మదే ప్రభూ!
కోరెద నిష్టకామ్యముగ, కూర్చెదు పెన్నిధి నా కదే సుమీ. 10

(9వ పద్యమున తెలుపబడిన ఆళ్వారుల కోరికకు తగి నట్లు ఆయనయెడ గౌరవసూచకముగ కొండమీది ఆలయ మున గర్భగృహమునకును, శయనమండపమునకును నడు మనున్న రాతిగడపకు (stone step) కులశేఖరప్పడి యని పేరు పెట్టబడినది. అది బంగారుపూతతో కూడియున్నది. స్వామిని దర్శించు భక్తులు తమ పాదములను ఆ గడపకు సోకనీయరాదను నియమ మున్నది)

V

ఇందు, కేరళముననున్న తిరువత్తువక్కోడు క్షేత్రమునవెలసిన శ్రీమ న్నారాయణుని దర్శించినపుడు, ఆళ్వారులు తమకు స్వామియెడ గల అనన్యభక్తిని, అనన్యశరణాగతిని, పదివిధాల నుదాహరించి తెలుపుచున్నారు.

సురభిళ సుందర ప్రసవ శోభితమౌ వనరాజి మెచ్చుచున్
అరయువు, త్వత్ప్రకల్పితమ యైనది నాయెడ నేచు దుఃఖ, మే
మరకయ నీ పదాబ్జములె మంచుత దిక్కయి వాకు, గెంటుచున్
అరయుక తల్లికోపపడ, నర్భకుఁడేడ్చుచుఁ, జెంతఁజేరఁడే!

ఆకాశోన్నత వప్రమధ్యమునయుం దారూఢ సౌధంబునన్
ప్రాకారుండవు, వన్నుఁబ్రోచుట కుపేక్షంజేసినన్ దేవ, వి
న్నే కొల్తున్ శరణంది నీపదములే యేలంగ, సత్కాంత, య
ప్తోకానేక సపర్యలఁ విడుచునే దుశ్శీలుఁడౌ భర్తకున్. 2

మీనముల్ మక్కువతో వసించు పొలముల్ మేలంద, తన్మధ్యమం
దావందించెదు నిన్నె, రక్షకొఱకై ధ్యానింతు; నీ దృష్టిలో
వేనేలంబడనైతి దేవ, జనముల్ నిత్యంబు సేవింపరే
భూనేతన్ విపరీతధర్ము నెపుడో పుణ్యుండుగాఁగోరుచున్. 3

తనువుం గోసెడు శస్త్రవైద్యునెడ స్వాస్థ్యంబొప్ప కాంక్షించుచున్
తన విశ్వాసముఁ జూపు రోగి; యటులే దాసుండనై దేవ నీ
యనుకంపన్ మదినెంచి కొల్చెదను శ్రేయఃప్రాప్తి వాశించుచున్,
అనయంబీవు అనంత దుఃఖములు నాకంటంగఁ గల్పించినన్. 4

వనమత్త ద్విపమున్ వధించితి కృపాపారీణ! నీ యంఘ్రులే
వనుఁబ్రోవందగు, వీడుటేలను? శరణ్యంబుల్ గదా నాకవే,
కనలేకందరి, పక్షి, యబ్ధిపయి నాకాశంబునం బోవుచున్
మును తా వీడిన యోడకంబమున కాల్మోపుం గదే యుండగాన్. 5

భానుమరీచి జాలములు పర్వవికాసము గాంచు పద్మ, మో
దీనజనావనా; అనలదీప్తికి శోభిలఁబోవ, దబ్లె, నా
మానసమెంతొ పంకిలము, మానిత త్వత్సుగుణైకధర్మమా
ర్గానవె గాక యన్యవిధిఁగాంచునె విశ్రుత పావనత్వమున్. 6

చిరకాలంబును వర్షముల్ పడక శోషింపంగ సస్యంబు లు
ర్వర మేఘోదయవేళ గాంచుటకునై వాంఛించి వీక్షింపవే,
కరుణన్ నా దురితంబు లూడ్చుట కుపేక్షన్ జేయుదైనన్, సదా
స్థిరతన్ నాదగు చిత్తమో వరద! నిన్ సేవించుచున్ నిల్చెదున్. 7

నీలజీమూతగాత్ర! నిర్నిద్రతేజ !
ప్రథితపుణ్య స్వరూప! యో పరమపురుష!
భవదపార మంగళ గుణ వనధియందు
చేరు మచ్చిత్తలహరి, నీ సేవకొఱకు. 8

అనయంబున్ భవదీయసత్కృపను నే నాశించి సేవింతు, నీ
వనుకూలింప కుపేక్ష సేసినను నే ధ్యానింతు నిన్నే సదా,
మనుపం జాలిన నీ పదాబ్జములు సమ్మానించుచున్ వీడలేన్
కవజాలన్ భవదన్య రక్షణకునై కంజాక్ష! నారాయణా! 9

ధనమేలంచు నుపేక్షసేయుచును నిన్ధ్యానించి వాంఛించు నా
ఘన పుణ్యాత్మునె చేరు సంపదలు సంకల్పించి తామై సదా;
నను నీ వట్ల యుపేక్షసేయుచును నన్ వాంఛింపకే పోయినన్
నిను నే నెప్డు అపేక్ష సేయుదుఁ గదా, నిర్నిద్రతేజోనిధీ! 10

## VI

జగన్నాటక సూత్రధారియగు శ్రీకృష్ణుని యవతార లీలలను వివరించుటలో, నాయనయెడ, ప్రణయ రోష వివశలైన, గోపికల దశలను, తాము పొందుచు ఆళ్వారులు ప్రసంగించుట యిందుగలదు. తమ ప్రాణనాథుని వియోగమును సహింపజాలని వారు గోపికలు. అట్టివారికి, ఒక్కొక్కరికి ఒక్కొక్క విధముగా వియోగమును కల్పించి దర్శన మిచ్చి అనునయించు కృష్ణునితో వార లా యా సందర్భములందు ప్రణయరోషమున ప్రసంగించిన విధము ఈ క్రింది రీతిని వివరింపబడినది.

పరువంబైన సుగంధపుష్పములతో వక్రంబులౌ పెన్నెరుల్
పరిపాలించెడు గోపభామినుల సౌభాగ్యంబు పండింతు నీ
పరిరంభంబుల, కృష్ణ! అయ్యది యుసంప్రాప్తంబ నాకౌట, నే
సరితిన్ రేయి యుఱెల్లనోర్చుచు భవచ్ఛద్మప్రలోభంబునన్. 1

పెరుఁగుం ద్రచ్చెడు చారుగోపిక తనూ విభ్రాంత సౌందర్యమున్
పరిశీలించుచు తత్క్రియుం గలుగు నీ ప్రజ్ఞం బ్రదర్శించి, వా
దరికిన్ జేరెడు కృష్ణ, ఏల యుఱెపో, త్వన్నాట్యమున్ ముగ్ధ భా
సురబింబాధర సుప్రకంపనము నేఁ జూడఁగలే దందువా? 2

ప్రసవావతంసంపు పైదలి యెదురైన
కనుగీటెదవు కోర్కి కనువు మెరయు,
మెరుగు బంగరు చాయమేని జవ్వని గాంచి
మురిపింతు నగవుల మోహరించి;
మందహాసాంచిత సుందరి దరియుచో
కౌఁగిలించెదు వేడ్క గారవింతు,
ఉద్యానవనమందు ఉవిద యొక్కెడ నున్న
పలుకరించెదవు, మాయలను గొల్పి,
ఇట్టి నయుగార, మీప్రియు, మిట్టి చనవు,
ఈ సరసవాక్యముల, నమ్మ నెటులో చెపుమ?
అకట! ఇరు మద్దులను గూల్చినట్టి కృష్ణ!
పెరుగుచుంటివి మాయలఁబెంచికొనుచు. 3

తన ప్రేమన్ వెలయించి యిచ్చెడి యశోదాస్తన్యపీయూష మే
లనుచుఙ, పూతనపాలనే, విషమయంబైనట్టివే, త్రాగి తీ
వని గేల్సేయరె పిచ్చిబిడ్డ వనుచున్; ఔఁగాని, నీకే తగున్
కనుచో వాదగు దూతికన్ చిలిపిగా కౌఁగిళ్ల ముంచెత్తుటల్. 4

తనుమధ్యన్ బిగియారఁ, గౌఁగిలికి సంధానించి మోదింపఁగా
చనవుంగొల్పుచు రేయి చీఁకటిని సంచారింతు వీ వీథిలో,
తని వోకుండ మరొక్కతెన్ కనకవస్త్రం బింత చాటుంచుచున్,
గని చేనవ్వులఁ జేర్ప నెంతు, వది నేఁ గాంచంగ ఁజింతింతునే? 5

ఉపలాలించుచు శయ్య వీడితివి ఎంతో పాపముం జేసితిన్,
అపుడే కౌఁగిలి యిచ్చి తెందరకునో ఆ రేయి మర్నాడునన్,
నిపుణంబైనదె మల్ల యుద్ధమున నీ నిండైన బాహాబలం
బిపు డిచ్చోటను నిల్పనేల? చనుమా యేణాక్షులే మెచ్చఁగన్. 6

ఏలా వచ్చెదు మాగృహంబునకునై యీ యర్ధ రాత్రంబునన్
మేలంబాడ మృగాక్షులం గనవు, ఏ మీనాక్షినిం గాంచ, విం
కేలా వంచితనైతివో గదె, భవత్ హేలా ముఖాబ్జంబుచే,
చాలున్ నీ యధరోష్ఠముం గనుటయున్, చాల్నీదు నర్మోక్తులున్. 7

ఎదురైవచ్చు వ్రజాంగనన్ బిలిచి యెంతే కుందకుంజంబునన్
గదియం జూచితి ముద్దులం గురిసి, నన్ గాంక్షించి తీ విచ్చటన్,
కదియన్ డాఁగితి నంచు కోప మొదవున్, కానిమ్ము నాకేల! నీ
విదితస్మేర ముఖాబ్జనేత్రముల దీప్తింగొన్న లోలత్వమున్. 8

శ్రేయః ప్రదాతవై చెలువొందు వనమాలి,
వకలంక బర్హిపింఛావచూడ!
కర్ణికారాంచిత కర్ణభూషణుఁడవు
కనకాంబరుండ వాకర్షకముగ,
విరులతో, సొబగారు కురులవెత్తావితో,
వెదురైన లలనతో, వెడిమొ పలికి,
విఱుగజ్జియుల మ్రోత చిందించు నడలతో
పుడమికాంతకును మైపులక లొలయు,
వేణుగానామృతముతోడ వెర్లిగొనఁగ
ఏల వచ్చితి వోయి నీ విచ్చటికిని!
నన్ను నీ బాహువులఁజేర్చ వెన్నవేని
గోకులాంభోధిచంద్ర! యో గోపబాల! 9

కమలాలోలుఁడవైన ని న్నెవతెయో కంజాక్షి వ్రేపల్లె నీ
కమనీయస్ఫుట నాట్య భంగిమములం గాంక్షించి వీక్షింపఁగా,
తమితో ప్రేమమయోక్తులం గుపితుఁగా తర్కించి మోదింపఁగా,
సుమనోజ్ఞంబుగఁ బిల్చుచున్న దదిగో! సోత్కంఠ నందాత్మజా! 10

## VII

శ్రీకృష్ణుని శైశవ యౌవన లీలలను స్వయముగా జూచి, యానందింపజాలని దేవకీదేవి స్థితిని తాము పొందుచు, ఆళ్వారువారు ఆ లీలలను దేవకి మాటల్లోనే పొందు పరుచుచున్నారు.

సరసిరుహాయతాక్ష, కరిశాబక తుల్యబలప్రకాశ, సుం
దరదరహాస శోభిత సుధామధురేక్షునిభా, యదూద్వహా!
నిరుపమవార్ధివర్ణ, శయనింపవె కృష్ణ, యటంచు నూయె లం
దరుదుగ నూయెలంచు భాగ్యమది యబ్బని తల్లిని లక్కటక్కటా! 1

అరుణపదాబ్జముల్ ముడిచి, యాటకుఁ బొమ్మను కజ్జల ప్రభా
స్ఫురిత సుపద్మనేత్రములఁజూచుచు మెచ్చుచు, పేర్మి దోఁకన్
మెరసెడు గున్న యేనుఁగయొ మేఘపు కూనయొ నాగ, శయ్యపైఁ
బొరలెడు నిన్నుఁ గాంచఁగల పుట్టువు గల్గని దానవే కదా! 2

వనితల్ బందుగు లొక్కరొక్కరె యొడిన్ పాలించి, మీనాన్న యే
డనఁగా, ముద్దుగ వ్రేళ్లులఁజెనిరిపి యా పయా కాంతకుం జూపఁగాన్
కని, వందుం డెద వెంతొ మెచ్చెనట! నా కాంతుండు నీ చేష్టలన్
గని మోదించెడు భాగ్య మందఁడమె, పుణ్యం బేను గావింపమిన్. 3

పండువెన్నెల నింపి వసుధ కింపు ఘటించు
    నిందుచంద్రుని బోలు నెమ్మొగంబు,
అరవిందములసారు నవఫులింపఁగ ఁజాలు
    కాంతుల నెరజల్లు కన్నుదోయి,
సువిశాల సుకుమార సుందరవక్షంబు,
    బలిసిన యాజానుబాహు యుగము,
నీలమేఘద్యుతి నెలకొన్న దేహంబు,
    కోమలంబులు చూర్ణ కుంతలములు,
నీదు నవ యౌవనమునకు నిందు శోభ
కలుగఁజేయఁగ హర్షింపఁగలుగుచుంటి,
నకట! నీ శైశవపు చిన్నె లరయలేని
దైన్యమే నన్ను వేధించు తనయ! కృష్ణ! 4

నల్లని ముంగురుల్ నుదుట నాట్యము సేయఁగ, నన్నుఁ గోముగా
మెల్లన నీవు ముద్దు లిడ మెచ్చు నదృష్టము నందనైతి; నీ
యల్లరి రోషమున్ పలుకు లందలి చెల్వము, తండ్రి పోలికల్
మొల్లము గాఁగఁ గాంచుటకు మోద మెలర్చిన దా యశోదయే! 5

చెలువొప్పన్ పడిలేచు నీవు నడలన్ చిందించు నీ నాట్యముల్,
లలిమై ధూళినిఁ బ్రుంగు దేహ మొడిలో లాలించు సౌభాగ్యమున్,
వలనొప్పన్ చిఱువ్రేళ్ల పాయసము నాస్వాదింప, తచ్చేష్టమేన్,
కలయం గ్రోలుట గాంచనీని విధివ్రా ల్నా కెంత హీనంబొకో! 6

అంకముఁజేరికొంచు, కుచమందలి దుగ్ధము లావువేళ, ని
శ్శంకత నోటనున్న చిఱునవ్వొన నీదుచు నవ్వు కొందు నా
వంకన యున్న చూచుకముఁ బట్టెడు హస్తము సాచి, శైశవా
లంకృత సన్నివేశము అలభ్యము నా కది గాంచి మెచ్చఁగాన్. 7

నవనీతం బొకకుండమండి గొనుచున్ బ్రాసింప, వీక్షించి, ని
ష్ణవరోధింప యశోద త్రాడుగొనిరా, నానంద ముప్పొంగ నీ
నవనీతాంచిత వక్త్రపద్మమును, వివ్రాణంపు బింబోష్ఠమున్
దవులం బెగ్గిలి చూచి దండ మిదుటన్ తాఁ గాంచి నైమర్చెదున్. 8

అరయం గల్గి యశోద మెచ్చుకొన కృష్ణా! నీవు బాల్యంబునన్
గిరిగోవర్ధన మెత్తుటన్ యమునలో క్రీడించు కాళీయునిన్
ఉరగున్ద్రోలుట, భాండనృత్యమును క్రూరోదగ్రు వత్సాసురున్
విరుగం గూల్చుట చేసి నాడ నిపుడేన్ వీక్షింప లభ్యం బొకో! 9

చను లందించి విషాక్త దుగ్ధముల నాస్వాదింపఁగాఁజేయు పూ
తన ప్రాణాలను తోడివైచితి వనాధ్యన్ రక్కసిన్, అందుకే
నను, నా పుణ్య యశోదమున్ వదలి యెన్నం జూచి తా రక్కసిన్
జననిం గాగ, కుమార! నిం గనుటకే నా ప్రాణముల్ నిల్పితిన్. 10

## VIII

బాలుడుగా నున్న శ్రీరామచంద్రుని, తొట్లలో పరుండబెట్టి, జోల పాటలు పాడి నిదురపుచ్చెడు కౌసల్యాదేవిస్థితిని, ఆళ్వారులు పొంది, రామావతారమహిమను, తాము అనుభవించుచుండుట ఇందు వివరింపబడినది.

ఎద యూయెలగ నీకు పదిలపరచితి దేవ!
ముదమార శయనింపు మూచెదను రామ!
రామా! లాలీ, మేఘశ్యామ లాలీ
తామరసనయన దశరథతనయా లాలీ

వరకౌసల్యకు ప్రియతనయుఁడవై
ధరణికి భారము తొలగించుటకై
రావణు గూల్చితివో రఘురామా!
సేవల నందితి సురసంతతిచే. 1

అలి జగంబుల నెల్ల సృజియించినట్టి
నలువకుం బుట్టిల్లు నీ నాభికమలంబు,
వాత్సల్యరూప, యో దశదిశా రక్షకా!
సత్సేవితము నీదు చరితామృతము దేవ! 2

విమత సుమచూడాకలాపాభిరామా!
జనకునకు నల్లుఁడవు దశరథాత్మజరామ!
జననాథవంశభోగ్యామృతంబగు దీవు
నను కరుణతోఁజూడ వేవేగ రావా! 3

జనకాత్మజాలోల, కోదండపాణీ,
కనగ ముల్లోకాల సృజియింప నేర్చియును
జనియింప నెంచితివ అల్పనృపు నింట;
ఎనలేని నీ కరుణ వర్ణింప నా తరమ! 4

మురియుచును రాజ్యసంపద నెల్ల నీవు
భరతుచేతులఁబెట్టి వనవాసమునకు
అరిగితివి, లక్ష్మణుని సేవలం గొనుచు,
అరసి పాలించితివి, తండ్రి యానతి వినుచు. 5

పురజనుల్, బంధుగుల్, పరిచారికల్ బలియు
పరిచర్య నేమరని యనుజునిం దెలిసి,
తిరిగితివి వనములం దవనిజం గలిసి,
శరణాగతుల రక్షకుం దీక్ష వడసి. 6

బాలకుని పోలికను వటపత్రశాయివై
ప్రళయాన విశ్వంబు నీలోన నిల్పితివి;
వాలి వధఁ జేసి సుగ్రీవునిం గాచితివి,
పాలకుఁడవై భువిని ధర్మంబు నిల్పితివి. 7

వానరులతో గలసి వార్ధి బంధించితివి
పరిమార్చితివి లంక, లంకేశ్వరునితోడ,
సురల కబ్ధి మథించి యమృత మందించితివి
నిరవధిక సౌశీల్యగుణము నెరయించితివి. 8

సురనాగ యక్షాదులను దివ్యసంపదల,
పరగ సృజియించితివి సాకేతనాథ!
వరభక్తసేవిత ప్రథిత పదపద్మా!
శరణాగతుఁడ నేను మునిహృదయసద్మా! 9

జననియగు కౌసల్య శ్రావ్యగీతికలతో
నిను శైశవంబునను లాలించి పెంచినది,
విని మెచ్చు మో రామ! యీ సేవకుని గీతి
కని దేవ రమ్మ నన్ కనికరించెదు రీతి. 10

రామా లాలీ, మేఘశ్యామా లాలీ

## IX

కైకేయి వలలో బడి, శ్రీరాముని అడవులకుబంపిన దశరథుని యవస్థను, తత్ప్రలాపములను ఆళ్వారులు, దశరథుని స్థితిని బొంది, యనుభవించుచు సకరుణముగా వివరించుచున్నారు.

సకలరక్షాదక్షు, నకలంక గుణదీప్తు,
రఘుకులాలంకారు రామచంద్రు,
సుజనైకవంద్యు నిస్తుల సాహసౌదార్యు,
సర్వపౌరావీక సౌఖ్యవరదు,
యౌవరాజ్యపదంబు నాస్థమై గ్రహియింప,
సన్నద్ధుఁడై యున్న సౌమ్యచరితు,
వేదవేదాంగాది విద్యావిశారదు,
సుకుమారు, సత్పుత్త్రుఁజూచి చూచి,

వనములంబట్టి తిరుగాడఁబంపినాఁడ
కఠినురాలైన కైకవాక్యములచేత
బద్ధుఁడనయితి వంచింపఁబడితి నిట్లు
వరలుచుంటిని, జీవచ్ఛవంబ నగుచు. 1

మద్ఘోరవాక్యంబె మన్నించి పాలింప
విపుల రాజ్యశ్రీని విడిచినావు,
వేలాయుధమువోలె వెలుఁగు నేత్రుండవు
వనికి సీతం గూడి పయనమైతి
అడవుల కష్టాల ఁబడనెంచి తమజుతో
ధర్మప్రతిష్ఠయే దారిఁజూప,
రథగజతురగాది ప్రథిత వాహనముల
కాదని తరలితి కాలినడల

అకట! శ్రీరామచంద్ర! న న్నరయ వీవు,
పుత్త్ర, ప్రేమైక నిలయ, సత్పుణ్యగణ్య,
పుడమి నిశ్చేష్టితుఁడ నౌచు పడితి నిపుడు,
చేయఁగలదేమి? నాకు నస్తిమితమతికి. 2

సాధుసంరక్షక, సర్వలోకప్రియ
రక్తాంతలోచన, రామభద్ర!
శైలసన్నిభ భుజసంపత్ప్రభావ, యో
ధర్మ స్వరూప, సత్యప్రకాశ!

పరమపాతివ్రత్య భాగ్యసంపన్నమే
　　కౌసల్య కడుపారఁ గన్నపుత్త్రి
శార్ఙ్గ హస్తుండవు సౌజన్యమూర్తివి
　　పాపాత్ముఁడను నాదు పరమకఠిన
హృదయముం గరగించితి వెంతొ పుత్త్రి
అకట, సౌధాన మృదుశయ్యయందు నిదుర
చెందె దీ వెట్లు వనిలోని చెట్లనీడ
కటికరావేల, నిద్రింపఁగడగు దోయి! 3

శివుని ధనుస్సు ద్రుంచితివి సీతకు సుందర గాత్రవల్లికిన్
ధవుఁడవు గాఁగ, రమ్మిట సుతా! ననుఁజేరి ముకించు కేగు మీ,
వవుర, మదేభసంభృత భయంకర ఘోరవనాళి కేగుచున్
దవులను నుండ, నాదు హృది తానయు వ్రీలదు రాయిగా నయెన్. 4

నను తండ్రీ యని ప్రేమమీర మధురానందంబునం బిల్వఁగా
వినలేకే, త్వదిభేంద్ర యానమును, సంప్రీతిన్ ముఖాబ్జాతమున్,
కనలేకే, నిను గౌఁగిలించు సుఖమున్ కాంక్షింపలేకే, యిటుల్
వనులంబట్టఁగఁజేసి, పాపమతినై వర్తింతు దుఃఖంబుతోన్. 5

కూరిమిదప్పి కైక తన కోరిక పల్మరు దెల్పుచుండ, నీ
వోరిమి నాదు పాపపు దురూక్తులచేతను వంచితుండవై
ఘోరవనంబులం బడఁగఁ, గోరితి, వాఁకలికెట్టులోర్తు,వ
న్వారిగ నాడి ఱాలపయి పాదము లూనుచు బాధలందుచున్. 6

అనఘ సుమంత్ర! వేదవిదులైన ధరామరవర్యులార! యొ
వనమునవే జటాళ్యజిన వల్కలముల్ ధరియించి రాముఁ డొ
య్యన వనవాసి యౌటయును, అరగఁబండిన వృద్ధమూర్తినై
మనుట పురాన, న్యాయమొకొ! మాన్యులు మీరలు దెల్పవేర్తురే? 7

అమఁగుం బుత్త్రుని యగ్రజున్ స్మృతులయం దారూఢ ప్రజ్ఞాన్వితున్
ఘను శ్రీరాముని, తద్వితీయునిని కైకా లక్ష్మణున్, కీరవా
ణిని సీతన్ స్నుష నా వనంబుకడనే నిల్పించి మోదింతు, నే
మనదున్ నిందింతుఁజేసితౌ భరతు, నా కర్పించుచున్ మృత్యువున్. 8

పరశురాముని చేతి వైష్ణవచాపంబు
　　నొక నిమేషములోన నూడ్చినైచి,
అంతతోఁ బోక తదౌన్నత్యమును, తప
　　స్సిద్ధియు మొదలంట, జెరచి తీవు;

నీ వియోగాగ్నికి నిలువఁజాలని తల్లి
        వనరుటం గాంచియు పాటిగొనక,
పితరు వాదేశంబు పేర్మిమై పాటించి
        దారుణాటవులకుఁ దరలి తీవు,
జానకీనాథ, శ్రీరామచంద్ర, విమల
సద్గుణస్తోమ, రఘువంశజలధి సోమ,
సౌమ్యగతి నాకు నేడేడు జన్మములను
తనయుఁడవు, గాఁగ జన్మింప తలఁపుఁగనెదు. 9

సరళాత్మలైన కౌసల్యాసుమిత్ర లా
        క్రోశింపఁ, గాదని త్రోసిపైచి,
ముదుసలి క్రూరాత్మ, ముంగోపి మంథర,
        బోధింప నాలించి, పుణ్యహీన
కైక, యాజ్ఞాపింపఁగానంత వెంటనే
        అడవుల వసియింప నభిలషించి
రమణీయ దృశ్యమై రాణించు మహనీయ
        పుర మయోధ్యను వీడి తరయు నీవు;
ఇంకపురమున నాశింపనేమి కలదు,
కాన, నిప్పుడు స్వర్గంబెఁ గాంచఁ దలఁతు
నోయి రఘువంశవర్ధనా! ఓయి రామ!
సర్వజగదభిరామ! సౌజన్యధామ! 10

## X

శ్రీరామాయణకథను సంగ్రహముగా దెల్పుచు, శ్రీరాములవారికి శరణాగతులగుట, ఇందు ఆళ్వారులు వివరించుచున్నారు.

విశ్వంబునకు కాంతి వెలయనిచ్చెడువాని
        ఇనవంశ మకుటమై దనరువాని,
నీలమేఘచ్ఛాయ నిండు దేహమువాని,
        రక్తాబ్జనేత్రుఁడై గ్రాలు వాని,
ప్రాకారసంభృత ప్రముఖ సౌధములతో
        పరఁగుచుండు నయోధ్యపురమునందు,
తన దివ్యతేజంబు తనరారి వెలుఁగొంద
        పురుషోత్తముఁడు గాఁగ వరలువాని,
ప్రాజ్ఞకౌసల్య గారాబుపట్టి గాఁగ
బరఁగు శ్రీరామచంద్రుని పరమభక్తి
నభయహస్తుని, హృదయమం దధివసింప
చేతులంజేర్చి మ్రొక్కెదు చిత్తమలర. 1

గాధేయు నాజ్ఞచే కాంతయున్ శంకను
వీడి, శక్తిమదేకవిశిఖ మెత్తి
గాటంబుగా నాటి తాటక యురమును
వ్రక్కలించుచు నేలఁ బడగఁ జేసి, 2
ఘోర రాక్షసులను ఏరి వధించుచు
కూళయైన సుబాహు కూల్చివైచి,
ఆ వెక్క మారీచు నాకసంబున కెత్తి
అబ్ధిలోఁబడవైచి యణఁచివైచి
రక్కసులబారి పడకుండ రక్ష యిడుదు
మునిగణంబుల కనిపల్కి, పూన్కి మెయిని
ప్రతిన చెల్లించె యాగసంరక్షణమున
రామచంద్రుండు విబుధాభిరాముఁ డగుచు. 2

జనకుని కూఁతురౌ జానకిన్ తాను ప
ద్మాయతాక్షిని పెండ్లి యాడువేళ,
మౌని యాదేశంబు మైకొంచు సభలోన
శివధనుర్భంగంబుఁ జేసి; మెరసి;
పురిఁజేరుదారిలో పరశురాముని చేతి
ప్రబల చాపంబును వంచి, యతని
గర్వంబు సర్వంబు, కల తపస్సిద్ధియు,
అణఁచి తద్ధనువు వరుణున కిచ్చి,
వైష్ణవంబైన తేజంబు వడసి, యంత
తనదు తలిదండ్రు లెంతొ సంతసము పడఁగ
జానకీనాథుఁడై రామచంద్రుఁ డేగె
పురి కయోధ్యకు తా పూర్ణపురుషుఁ డగుచు. 3

తల్లిపల్కిన మాట తన తండ్రి యాజ్ఞగా
పైతృకరాజ్యంబు వదలివైచి,
భక్తుఁడైన గుహుని పరమసాహాయ్యాన
అవలీలగా గంగ కవలఁజేరి,
అనుఁగు సోదరుఁడౌచు వినతుఁడౌ భరతుని
తన పాదుకల నిచ్చి తనిపి, పంపి,
అడవిలో చిత్రకూటాద్రిపై నొకచోట
ఆశ్రమంబును గూర్చి యమవుమెరసి,
జనకరాజసుతయు సౌమిత్రియుం గూడ
తనను గొలిచి సేవ లొనరఁజేయ,
వినుత ఋషుల మధ్య వేడ్క శ్రీరాముండు
నేత్రపర్వ మగుచు నెలవు చేసె. 4

దారిలో నెదిరించు దారుణాసురుఁడైన
చండ విరాధుని సంహరించి,
వరుణుని కిచ్చిన వైష్ణవ చాపముల్
శర, శరధివర శస్త్ర సహితముగ
శ్రమఁజెందు చడవుల, ద్రవిడవాఙ్నిర్వాహ
కుని కుంభజుం గాంచి, కొలిచి, పడసి,
దశకంఠు పోదరి తరళాక్షి యగు శూర్ప
ణఖముక్కు చెవులను నరకఁ జేసి,
ఖరముఖాది దనుజ గణముల నెల్లను
కూర్చె నెక్కటికను కొంకులేక,
మాయలేడియైన మారీచు వధియించె
రామచంద్రుఁ డఖిల రక్షకుండు. 5

అవనిజన్ వెదకంగ నడవులంబడి పోయి
కని జటాయువును స్వర్గమున కనిపి
వాలి సుగ్రీవులు ద్వంద్వయుద్ధము సేయు
హితుఁడైన సుగ్రీవు నెంచి కావ,
చెట్టుచాటున నిల్చి సింహవిక్రముఁడైన
వాలిని ఒక కోలఁ గూలవైచి,
వానరేశ్వరుమైత్రి వర్ధిల్లఁగాఁ జేసి
యతనికిన్ కిష్కింధ నప్పగించి,
జానకిం దోడితెచ్చెడు సాధనమున
కడఁక లంకను హనుమచేఁ గాల్పఁబంచి,
దైత్యరాజగు రావణు ధైర్య మడఁచె;
రామభద్రుండు త్రైలోక్య రక్షకుండు. 6

శరమును సంధించి శరధి యౌద్ధత్యంబు
నడఁగించి దాసోఽహ మనఁగఁజేసి,
వానరబలముతో వార్ధిని బంధించి
సేతువు నిర్మించి చెలఁగి మెరసి,
కపిసేన గొలువంగ కడలినిం దాఁటుచు
అవలీలగా లంకయందుఁజేరి,
దైత్యులతోఁగూడ దైత్యాధినాథుని
సంగ్రామ భూమిని సంహరించి,
శరణుకోరిన యా విభీషణునిఁ బిల్చి
లంక కధిపతి గాఁగ నలంకరించి,
ధరణిజం గూడి సాకేతపురము చేరె;
రామచంద్రుండు జగదభిరాముఁ డగుచు. 7

దనుజాధిపుని తన ధనువున కెరఁ జేసి
భూమికిం భారంబు పోఁబెట్టి,
మణిగణాంబర హేమ మహిత దీప్తులతోడ
మెరసి కన్పిందైన మేడ లొప్ప
పురి నయోధ్యను జేరి, పుడమిని పాలించె
ధర్మ మెల్లెడలను దనరఁ జేసి,
దనుజేశు పూర్వవృత్తం బగస్త్యుఁడు దెల్ప
అరయుచు స్వీయమౌ చరితమెంతొ
శ్రవణ సుఖముగ కుశలవుల్ శ్రావ్యగీతి
నాలపింపంగ మధుర రసాన్వితముగ;
వినియె, హర్షాశ్రు లొలుకంగ ప్రీతితోడ;
రామచంద్రుండు సుగుణాభిరాముఁడగుచు. 8

విప్రవర్యుల మాట విని తపమ్మును జేయు
శంబూక మౌని మస్తమును ద్రుంచి,
బ్రాహ్మణబాలుని బ్రదికించి దివ్యమౌ
హార మగస్త్యుఁ డేయంగఁ దాల్చి,
ఆలంబులో లవణాసురున్ వధియింప
శత్రుఘ్ను నియమించి సౌమ్యగతిని,
కాలునిం గూడి యేకాంతంబుగా నున్న
యపుడు, దుర్వాసుని యాజ్ఞ దెలుప,

అరసి, సమయంబు మీరిన యట్టివాని,
నీడపోలిక తనవెంట నిలచువాని,
నను౯గు సోదరు, లక్ష్మణు నంత విడిచె;
రామభద్రుండు ధర్మాభిరాముఁ డగుచు. 9

సౌమిత్రి తనుదాన స్వర్గంబునకుఁ బోవ
తద్వియోగమునకుం దాళలేక,
రాజ్యంబు వేలెదు ప్రాజ్యాధికారంబు
విడిచివైచుచు రామవిభుఁడు నంత

శరణాగతులుగాఁగఁజను దెంచు పౌరుల
పశువులన్, ద్విజులను, పరమకృపను
వారి కోర్కెల నెంచి, స్వర్గంబునకుఁ బంపె
సరయూముఖంబుగా సమ్మతించి;
అంతలో వైనతేయుండు చెంతఁజేర
నతని వాహనముగఁ జేసి యవని వీడి,
చేరె వైకుంఠధామం బవారణముగ;
రామచంద్రుండు త్రైలోక్యరక్షకుండు.

సమాప్తము

# "పెరుమాళ్ తిరుమొళి"లోని పాశురములకు తెనుగున--వచనానువాదము

## ప్రథమ దశకము

1. తన వేయిపడగలయందలి రత్నకాంతులను ప్రసరింపజేసి, చీకట్లను తొలగించు ఆదిశేషునిపై పవళించి యుండు శ్రీరంగేశ్వరుని పాదపద్మములను, కావేరీనది తన తరంగ హస్తాలతో సేవించుచుండును. అట్టి శ్రీహరిని నా నేత్రములు గాంచి ఎప్పుడు ఆనందింపగలవో కదా!

2. సప్తప్రాకారములచేత రక్షింపబడునది శ్రీరంగక్షేత్రము. శత్రువులు గావించు అపాయముల శంకించి, రక్షణముగా తన విషాగ్నిని వ్యాపింప చేసి, పువ్వుల చాందినిగా నమరించి, తన వేనోళ్ల తోను, స్వామి వేయి నామములను కొనియాడుచు, ధవళవిగ్రహుడై యుండు శేషుని శయనముగా గలవాడు రంగనాథుడు. అవిసె పూవువలె నందమగు కోమల దేహ··· గల ఆ స్వామిని ఎపుడు కాంచి కొనియాడగలనో కదా! ఎదుటనున్న ఆమోదస్తంభములనాని, కన్నులకరవుదీర స్వామి నెప్పుడు కాంచగలనో కదా!

3. బ్రహ్మ నిరంతరమును గాంచుచు, తన నాలుగుమోముల పొగడు చుండగా, ఫణిశాయియైయుండి, సేవించు భక్తవరులకు, కరుణా కటాక్షములతో నభయ మొసంగుచుండు రంగేశుని, పాదములకు పూజసేయుచు ఎప్పుడు చూడగలనో కదా!

4. శ్రీరంగేశుడు, రాక్షసుడైన కేశి శిరస్సును ఖండించినవాడు. గోవర్ధనగిరి నెత్తి, గోవులను, గోపబాలురను రక్షించినవాడు నీలమైన సముద్ర జలమువంటి దేహకాంతి గలవాడు. ద్రవిడవేదములచేతను, సంస్కృత వేదములచేతను మాత్రమే తెలియబడువాడు. అట్టి రంగనాథుని, నా హృదయమందు నెలకొనియున్నవానిని, కన్ను లర మోడ్చి భక్తిపరవశుడనై ఎప్పుడు చూచెదనో? చేతులారంగ నెప్పుడు పూజింతునో కదా!

5. నారద, తుంబురులు తమ వీణెలమీద వేదనాదములను, విన సొంపుగా పలికించుచుండగా, భక్తకల్పకమైన రంగనాథుడు శేష

శాయియయి ప్రకాశించు చుండును. ఆయనను కనులార గాంచి, మ్రొక్కు నదృష్టము నాకెప్పుడు పట్టునో గదా!

మధురములైన పరిమళములను జిమ్ము పూవుల వనముతో గూడినది రంగమందిరము. అందు మునులు, దేవతలు, దేవకన్యలు, ఈశ్వర బ్రహ్మాదులు పూలదండల నర్పించుచు రంగనాథుని కొల్చుచుం దురు. అట్లు, భక్తవశంకరుడైన స్వామిని, ఆనందాశ్రుల గురిపించుచు సేవించు భాగ్యము నా కెప్పుడు గల్గునో కదా!

పాప రహితులై, ఇంద్రియములను జయించినవారై, సజ్జనులచే కొనియాడబడు, ధర్మమార్గమున చరించు, భక్తవరులకు వశుడైన రంగనాథుని మిగులభక్తితో నెపుడు సేవింతునో కదా!

పుష్పవనాలు, వరిచేలు చుట్టునునుండగా మధ్యనున్న శ్రీరంగము నందలి రంగనాథుని, దేవతలు, గరుత్మంతుడు, పంచాయుధములు చుట్టును నుండి కొలుచుచుండగా నేను ప్రార్థింప గలుగుట యెప్పుడో కదా!

సముద్రఘోషవలె తూర్యనాదములు మ్రోగుచుండగా, దేవాలయ మున, భక్తులు శ్రీరంగేశుని కీర్తిని గానము చేయుచుందురు. నేనును వారలతో గలసి స్వామిని కీర్తించుచు, నాట్యము చేయుట ఎప్పుడు కలుగునో గదా!

స్వర్గాది ఊర్ధ్వలోకాల దేవతలు సుఖపడుట కొఱకును, ఇలలో మాన వులు పుణ్యాత్ములై సుఖపడుట కొరకును పాపములు మొదలంట నశించుట కొరకును, భక్తవరులు నిండుగా సంతోషముతో వర లుట కొరకును దక్షిణదేశాన, దక్షిణదిశాభిముఖుడుగా, శేషశాయిగా, నవతరించిన రంగనాథుని కొనియాడు భక్తవర గోష్ఠిలో నేనును ఒకడనుగా నై ప్రకాశించు కాలమెప్పుడు వచ్చునో కదా!

## ద్వితీయ దశకము

స్వయముగా ప్రయత్నించి పొందుటకు దుర్లభుడును భక్తుల యను భూతికై తన తేజమును స్వయముగా నొసంగువాడును, వాడని

వనమాల ధరించువాడును లక్ష్మీసనాథుడును, శ్రీరంగమున ఫణి శాయియై భక్తులకు కల్పకమై యుండువాడును నగు రంగనాథుని, నామసంకీర్తనాదులతో తన్మయులై సేవించు భక్తవరుల గోష్ఠినిగాంచి సేవించుట కన్ను లున్నందులకు ఫలము.

2. వ్రేపల్లెలో గో, గోప, గోపీ జనులను రక్షించుటకై కృష్ణుడుగా జన్మించినవాడు, ఒకే బాణముతో సప్తసాలములను భేదింప రాముడై పుట్టినవాడు, క్షీరసాగర మథనకాలమున జన్మించిన లక్ష్మిని చేపట్టి నవాడు, శ్రీరంగమున శేషశాయియై యున్నవాడు, అట్టి శ్రీశుని భక్తుల పాదపద్మధూళిలో మునుగు నాకు గంగానదిలో స్నానమాడు నాశ లేదు.

3. నీలాదేవిని పెండ్లాడువేళ వృషభములనేడింటి పొగరును అణచిన విధము, త్రివిక్రముడై బలిగర్వమణచి, భూమిని కొలిచినవిధము-- సముద్రములో మున్ను భూమిని లేవనెత్తిన విధము--ఇట్టి యవ తార మహిమలను తలచి, దేవళమునకు ప్రదక్షిణము చేయుచు, కావేరీ ప్రవాహమువలె ఆనందాశ్రువులను గురిపించుచు సేవించు రంగనాథుని భక్తుల పాదధూళి, నా ఫాలాన సోకి నన్ను రక్షించును గాక.

4. పెరుగు, వెన్న, పాలు, క్రమముగా వ్రేపల్లెలో దొంగిలించుచుండగా తల్లి కోపించి, త్రాటితో బంధింపగా ఆ స్థితిలోనున్న శ్రీకృష్ణుని గాంచి, నమస్కరించి నారాయణా! వరదా! యని, కొనియాడు భక్తవరుల పాదాలను సేవింతును.

5. భయంకరములైన సప్తవృషభముల పొగరడంచి, నీలాంబను పరిణ యమాడి సుఖపడినవాడు, కాళీయఫణి ఫణాగ్రమున నాట్యమాడి, దాని మదము నడచినవాడు, శ్రీరంగమున శేషశాయియై యుండు వాడు, నయిన ఆ రంగనాథుని తమ హృదయాల నిల్పి, కొల్చి ధ్యానపరులై యుండు భక్తవరుల సేవింతును.

6. అపరిచ్ఛేద్యుడు, సృష్టికి మొదలైనవాడు, ప్రళయకాలమునందును నుండువాడునగు రంగనాథుని భక్తవరులు, నాస్తికుల పాపములను గూడ హరింపజూచినవారు. అట్టి పవిత్ర హృదయులను జన్మ జన్మములను స్తుతింతును.

7. రంగనాథుడు నీలమేఘచ్ఛాయగల దేహము గలిగి, దివ్యతేజస్సుతో నలరారుచుండును. వెడదయైన ఆయన వక్షము కౌస్తుభరత్నముతో ప్రకాశించును. ఆయన కెమ్మోవియందు ధవళకాంతులనీను చిరునవ్వు రాణించుచుండును. కంఠము శంఖమువలె మెరయుచుండును. అట్టి అఖిలతేజోమయుని పాదపద్మములందు తమ సమ్మోదాశ్రుల గురిపించు భక్తవరుల పాదములనే, నేను ధ్యానింతును.

8. మధుపములతో ప్రకాశించు తులసి హారము మెడలో మెరయు పద్మనేత్రుని, ప్రభువును, శేషశాయిని, రంగనాథుని, సుందర స్వరూపమును గాంచి, తాండవ, నాట్య శోభలతో ప్రణమిల్లి స్తుతించు భక్తవరులను మెచ్చుకొనుటలో మునిగిపోవుదును.

9. ఎందరో పుణ్యాత్ములు నమస్కరించుచు, పొగడుచు, మేనులను మరచి రంగనాథుని విఖ్యాత గాథామృతమును గ్రోలుచుందురు. అట్టి వారిని గాంచి పిచ్చివారుగా భావించు జనులే వెఱ్ఱి వారందును.

10. లక్ష్మీవల్లభుడగు రంగనాథుని అనన్యభక్తితో సేవించి, ధన్యులగు పుణ్యాత్ములను గాంచి, పొగడి, వారికి నమస్కరింతును.

## తృతీయ దశకము

1. నన్ను రక్షించు రంగనాథుని స్తుతించుటలో మునిగినవాడను. కావున క్షణికమైన జీవితమే శాశ్వత మనుకొను పామరులతోడి సఖ్యమును గోరను.

2. నేను పరాత్పరుడగు రంగనాథుని స్తుతించువాడను. స్త్రీలోలురతో నేను సహవాసము చేయను.

3. మన్మథబాణములకు గురియగు చపలచిత్తుల జోలికి పోను. నిరంతరమును నరకహంతకుడగు శ్రీహరిని కొనియాడు నున్మత్తుడనుగా నుంటిని.

4. పూతన పాలు త్రావి దాని ప్రాణాలను హరించిన పరంధాముని యెడ భక్త్యావేశము గల నేను, అన్నవస్త్రాలకై ఆశపడువారి స్నేహమును నిరసింతును.

5. నేను శ్రీశుని భక్తితో సేవించు వ్యామోహమున మునింగియుం టిని. పవిత్రమైన జీవితమార్గమును వదలినవారి పొత్తు నాకెంత మాత్రమును వలదు.

6. పరమపురుషునికి సేవలు చేయుటలో నిమగ్నుడనై, భక్తిపారవశ్యమున నుంటిని. అట్టి అనన్యభక్తిగల నేను స్వర్గభాగ్యములను తృణప్రాయములుగా నెంచుదును.

7. స్వామి! రంగనాథ! పరమపురుష! దయానిధీ!అని సంతోష పారవశ్యమున కొనియాడుచుండు నాకు, ధూర్తులతో సహవాసము చేయు కోరిక తొలగిపోయినది.

8. సమస్త పామరజనులను నేను పిచ్చివారలని యనుచుందును. కాని వారి మనస్సులలో నేనే పిచ్చివాడనుగా మిగిలిపోయితిని.

9. చక్రహస్తుడు, లక్ష్మీసనాథుడు, పద్మనేత్రుడు, సకల సౌందర్యరాశి యైనవాడు, రంగనాథుడు, ఆయనను నిరంతరమును ధ్యానించుచు ప్రపంచమునే మరచి వెఱ్ఱివాడనై తిరుగుదును.

10. శేషశాయియగు శ్రీరంగేశుని దివ్యపాదపద్మకాంతిని దర్శించు పుణ్యాత్ములకు దురవస్థలేవియు సంభవింపవు.

## చతుర్థ దశకము

1. శ్రీశునికి నిలయమైన శ్రీవేంకటాద్రి పరమ పవిత్రమైనది. దానియెడ నధికమైన పూజ్య, భావమును, భక్తియును గలవారు ఆళ్వారులు. ఆ గిరితో నెడతెగని సంబంధము గల జన్మమునే వారు కోరుకొనుచున్నారు.

శ్రీశునికి సేవ చేయుటకు తగిన భాగ్యములేని, మాంస సంవర్ధితమైన నరజన్మమును నిరసించుకొందును. వివేకము లేకపోయినను ఏ తిర్యగ్జాతిలో పుట్టినను. నాకు మేలే యగును. పాంచజన్య ధరుడైన వేంకటేశ్వరుని పర్వతమందలి స్వామిపుష్కరిణిలో పక్షినై, బకమునై జన్మింపగోరుదును. అది వైకుంఠవాసముతో సమానమైనది గదా!

2. కోరనిదే లభించినను దేవేంద్ర పదవివలనను రాజ్యాధికార వైభవము వలనను కలిగే ఫలమేమియు నుండదు కదా! పుష్కరిణితో సంబంధముగల చేపజన్మము లభించినను అది సర్వోత్తమ మైనదే యగును.

3. నీటిని విడచినచో చేప బ్రదుకదు. అది స్వామిని ఎల్ల కాలమును సేవించుటకు తగని జన్మమై పోవును. కావున స్వామికి అంతరంగ కైంకర్యము చేయు మానవజన్మ లభించినను తగునని యాళ్వారులు ఇట్లు స్వామిని ప్రార్థించుచున్నారు.

"హర దేవేంద్రాదులు దేవతలతోగూడి లోనికి చొర రాక ద్వారము కడనే స్వామి దర్శనమునకై నిలచియుండగా, నేను అంతరంగ కైంకర్యము చేయువారితో గలసి, బంగారు పాత్రధారిగా నుండి సేవ చేయగల మానవజన్మమైనను కోరుకొందును."

4. వెనుకటి దానిలో బంగారు పాత్ర ధారిగా స్వామికి కైంకర్యము చేయ గల జన్మమును కోరుకొనినారు. కాని బంగారము దొంగతనమును చేయు బుద్ధిని గలిగించును. అప్పుడు అధికారులు విధించు శిక్షలకు గురియౌటచే, నిరంతరసేవ కాటంకము కలుగ గలదు. కావున అట్టి జన్మమును నిరసించుకొనుచు ఆళ్వారులు స్వామి పూల వనములో జన్మము నెత్తుటను కోరుకొనుచున్నా రీ పాశురమున. ఆ పుష్పములు స్వామిసేవకు వినియోగింపబడును. కావున అది ధన్యమైన జన్మమే. యగును అని భావించిరి.

5. సంపంగి జన్మము మంచిదే-- అయిననేమి శ్రీకృష్ణునంతటివాడు నందన వనమున నున్న పారిజాతమును హరించినాడు కదా! అటు లే యే విమనస్కుడో చంపకమును హరింపవచ్చును. అందుచేత శేషశైల వియోగము తప్పదు గదా! కాన అట్టి జన్మమును తగనిదే యైనది.

ఎవ్వరికిని అక్కరలేని క్షుద్రక్షుపముగా జన్మించిన తగునని, దానిని కోరుకొనిరి. 'దేవేంద్రాదిపదవులు లభించినను తృణీకరింతును'. అని యీ పాశురమున భావించిరి.

6. స్తంభముగా జన్మించినను లాభముండదు. కొండను బాగుచేయు నపుడు దానిని పెరికి వైచెదరు. ఇట్లు ఆటంకము తొలగి కొండ యందు స్థిరముగా నిలచియుండుటకు దాని శిఖరములలో నొకటిగా జన్మించిన బాగుండునని, అట్టి జన్మమును ఒసంగుమని స్వామిని వేడుచున్నారు. ఈ పాశురమున వెనుకటి పాశురాలలో వలెనే స్వర్గ రాజ్యభోగాదులను నిరసించుకొనిరి.

7. కొండశిఖరములను స్థపతులు విగ్రహాలను మలచుటకై బ్రద్దలుగొట్టుదురు. కావున శిఖరజన్మమును స్థిరముగా నుండునదికాదు. నదీరూపమునెత్తినచో దాని నెవరును హరింపలేరు. పైగా నందలి జలము స్వామి సేవకు వినియోగపడును అని భావించిరి.

'సెలయేటిలో ఎల్లకాలమును నీరుండదు. ఎండిపోవచ్చును. అయినచో వేంకటాద్రితో నిత్యసంబంధము తొలగిపోవును. కావున హరుడు దేవేంద్రుడు మున్నగు దేవతలు యజ్ఞములు చేయగా వారికి యజ్ఞఫలమునిచ్చు పరంధాముడు నిల్చియుండు కొండపై, స్వామికి సేవలు చేయుటకు వచ్చు భక్తుల పాదధూళి కనువైన దారిగా జన్మింప గోరుద"మని యాళ్వారులు భావించిరి.

8. 'కాని దారిగా జన్మించినను లాభములేదు. దానిని భక్తుల సౌలభ్యము కొరకు మార్చుచుందురు. అందుచే భక్తవరుల పాపములను పోద్రోలు నట్టి కరుణామయుడ వగు నో వేంకటేశ్వరా! గుడిలో నీకెదుట నుండి, భక్తుల పాదరేణువులతోనిండి యుండు మెట్టుగా నగు జన్మము నిమ్ము. నిరంతరమును నీ సందర్శన భాగ్యము నాకు లభింపగలదు' అని యాళ్వారులు ప్రార్థించిరి.

9. స్వామిదర్శనార్థము భాగ్యవంతు లెవరైన వచ్చి రాతిమెట్టు ఏల యుండవలెను అని భావించి, దానికి బంగారు రేకు తాపడము చేయవచ్చును. అప్పుడు నిరంతరము స్వామి దర్శనమునకు ఆటంక మేర్పడగలదు.

10. "స్వామీ! ఏ రూపమున జన్మించుద మన్నను ఏదో లోపము కనబడుచునేయున్నది. కావున అందమగు విద్రుమోష్ఠముతో ప్రకాశించు ముఖముగల ఓ వేంకటేశ్వరా! వరదా! నీ భక్తుడనగు నాకు, నీ

నివాసమునకు తగిన పవిత్రశైలమున, నే నే వస్తువుగా జన్మించిన, నా కోరిక ఫలించునో అట్టిది నీవే నా కొసంగుము, భక్తహృదయమున పీఠమువైచికొని యుండు నీకే అది సాధ్యమగును గదా! అదియే నా కోరిక. అదియే నా పెన్నిధి" యని కోరుకొనిరి.

"తన కోరికకు తగిన జన్మమును ఆ స్వామియే అనుగ్రహింపవలయును" అని ఆ భారమును ఆళ్వారులు తన యిష్టదైవమగు స్వామికే వదలివైచిరి.

## పంచమ దశకము

ఈ దశకమున, ఆళ్వారులు తిరువత్తువక్కోడు స్వామిని దర్శించి స్వామిసన్నిధానమున, శ్రీమన్నారాయణుడే తప్ప తనకు వేరే శరణము లేదని భావించి, పరిపూర్ణముగ శరణాగతిని చేయుచు, నీ క్రిందివిధమున ప్రార్థించినారు.

1. "దేవా, నీ యావాసము చుట్టును నున్న, సుగంధములనీను సుందరోద్యానములను జూచి మెచ్చుకొనుచు, నీవలననే నాకు కల్పింపబడిన సంసార దుఃఖములను జూచుచు నన్నుపేక్షించుచుంటివి. వానిని తొలగించుకొనుటకు నీ పాదములే సర్వవిధ రక్షకములుగదా! కన్నతల్లి కోపముతో తన బిడ్డను గెంటివైచుచున్నను అది యేడ్చుచు తల్లిపాదములనే ఆశ్రయించును గదా! నీకును నాకును గల సంబంధము తల్లికిని బిడ్డకునుగల సంబంధమువంటిది."

2. "దేవా! నీవు ఆకసమునంటు ప్రాకారముల మధ్యనున్న సౌధమున వేంచేసి దర్శనమిచ్చుచున్నావు. నీవు నన్ను కాచుట కుపేక్ష చేయుచున్నను, నీ పదములే రక్షింప తగినవని యెంచి, నిన్నే కొలుతును. భర్త దుశ్శీలుడై యుండినను, పతివ్రత యాతనిని సేవింపకుండ నుండునా? అట్లే నీ పాదసేవ నేను వదలజాలను.

3. "మీనులు మక్కువతో తిరుగునట్టి పొలములు చుట్టి యుండగా, దేవళమున దర్శనమిచ్చు స్వామీ! నీ కటాక్షము నాపై ప్రసరింప చేయకపోయినను, నిన్నే శరణు జొచ్చుట మానలేను. ప్రజలను,

రక్షింపవలసిన ప్రభువు వారిని రక్షింపక, విపరీతధర్మముగలవాడై యుండినను, ఎప్పటికైన తమ ప్రభువు మంచిగ మారకపోవునా యనుచు వారు ఆయనను సేవింపకమానరు. వారివలెనే నిన్ను నేను సేవించుట మానను.

4. "దేవా నీవే నాకు సర్వవిధ రక్షకుడవు. ఇట్టి అధ్యవసాయము గల నాకు నీ వెట్టి యాపద కల్పించినను, అది యంతయు, నా మేలు కొరకే యని భావింతును. తన శరీరమును కోసి బాధ కల్పించుచున్నను, అది యంతయు తన మేలుకొరకే యని వైద్యునియెడ, రోగి తన విశ్వాసమును ప్రకటించునుగదా! అట్లే దాసుడనైన నాయెడ, నీవు కరుణ చూపకపోయినను, నీయెడ నేను ద్వేషభావము కలిగియుండను."

5. "కువలయాపీడమను మదగజమును సంహరించి, కరుణామయుడవై ప్రజలను కాపాడితివి. అట్టి నీ చరణములే నన్ను రక్షింపదగినవి-- వానిని ఏల విడువవలయును? నేను వానినే శరణమందుదును. సముద్రమధ్యమున ఆకాశములో నెగురుచు, ఒడ్డును గాంచని పక్షి, తిరిగి, తా నిదివరలో తనకు రక్షకమైనదిగా నుండిన యోడకంబము మీద వ్రాలునుకదా! నేనును ఇప్పు డా పక్షి స్థితిలో నుంటిని."

6. "దేవా! సూర్యకిరణాలవేడిమికి, వికసించునట్టి పద్మము, అగ్నియొక్క వేడిమిసోకిన వికసింపదుకదా! అట్లే పాపముతో నిండిన నా మనస్సు, నీయందలి యుత్తమగుణములను ప్రకాశింపజేయు ధర్మ మార్గముచేతనే పవిత్రవంతమైనది యగును. మరియొక మార్గమున అట్లు కానేరాదు."

7. "దేవా! ఎంత కాలమునకును వర్షాలుపడక, శోషించుచుండు సస్యాలు మేఘముయొక్క రాకకు నిరీక్షించుచునే యుండును కదా! అట్లే నా పాపముల నింకించుటకు నీవు ఎంత కాల ముపేక్షించుచుండినను నా మనస్సు, నీ కరుణకై నిరీక్షించుచునే ఉండిపోవునుగదా!"

8. "ఓ పరమపురుషా! నీవు జీమూతగాత్రుడవు. పుణ్యస్వరూపుడవు. నిర్నిద్రతేజుడవు. నీ యనంత కల్యాణగుణము లనెడు సముద్రము

నందు నా మనస్సనెడు నదీప్రవాహము నీ సేవకొరకై చేరిపోవును. నీ మంగళకరగుణములను భావించుటలోనే నా మనస్సెప్పుడు మునిగి యుండును..."

9. "పద్మనేత్రుడవగు నో నారాయణా! ఎల్లపుడును నీ సత్కృపనే నే నాశించి, నిన్ను సేవింతును. నీ వనుకూలింపకపోయినను నిన్నే ధ్యానింతును. నన్ను రక్షింపగల నీ పాదపద్మములను ఎంత మాత్రమును వీడలేను. నీకంటె నన్ను రక్షింపగలవారు, ఎవరును ఉండరు.

10. "ఓ దేవా! నిర్నిద్ర తేజోనిధీ! ధనమును నిరసించుచు నిన్నే ధ్యానించి, నీ రక్షణమునే వాంఛించు పుణ్యాత్మునే సంపదలు తమంతట తామే వచ్చి చేరును. నన్ను నీవట్లు ఉపేక్ష చేయుచును వాంఛింపకేపోయినను, నిన్ను నే నెప్పుడును అపేక్ష చేయుదును గదా!"

"భగవంతుడగు స్వామికి జీవాత్మలు సొమ్ములు" అనుచు పరమాత్మకు జీవాత్మకు గల సంబంధమును నిరూపించుకొనుచు, శ్రీమన్నారాయణుడు తప్ప, తమకు వేరు శరణములేదని, ఆళ్వారులు స్వామికి పైవిధముగా విన్నపము చేయుచుండుట యిందు కాంచగలము.

## షష్ఠ దశకము

1. జగన్నాటక సూత్రధారియగు శ్రీకృష్ణుడు ఒక గోపికతో "నీ వీ నాటి రాత్రి, యమునానదిలోని యిసుక తిన్నెయందు నాకొఱకై వేచియుండుము. నే నచ్చటికి వచ్చువాడను" అనిచెప్పగా, నామె యచ్చట రాత్రి తెల్లవార్లు వేచియుండినను కృష్ణుడు రాలేదు. ఆ మరునాటి యుదయాన శ్రీకృష్ణుని కలిసికొన్నప్పుడు ప్రణయరోషముతో నిట్లు పలికినది.

"సుగంధ పుష్పాలతో శిరోజముల నలంకరించుకొని యుండు గొల్ల పడుచులను నీ కౌగిళ్లతో సంతోషపరచెదవు. నా కది లభ్యము కాలేదు. నీ మాయమాటలను నమ్మి రాత్రి యంతయు వేచి మోసపోయితిని గదా!"

2. "క్రింద యింటిలో నొక గోపిక చల్లచేయుచుండగా, నప్పటి యామె సౌందర్యమునకు ముగ్ధుడవై నీవును ఆమెవలె కవ్వమును త్రిప్పుట లోననుకరించుచు, ముద్దులిడి యామెను గౌరవించితివి. ఇప్పుడు నాకడ కేల వచ్చితివి? అక్కడకే పొమ్ము. పాపము నీ నాట్యవిన్యాసము, నీ యధరస్పందనము, నేను చూడలేదనుకొంటివి గాబోలును. వెడలిపొమ్ము" అని తిరస్కారసూచనముగ తన ప్రణయకోపమును ప్రకటించినది.

3. కృష్ణుని మాయమాటలకు లోనైన మరియొక గోపిక "కృష్ణా! శిరస్సున పువ్వులను దాల్చి యలంకరించుకొని శోభించు నొక గోపిక కనబడగా, నామెకు కోర్కిదీర కనుసన్నచేయుదువు. బంగారు కాంతితో గూడిన శరీరశోభగల యొక జవ్వని యెదురైన ఆమెను జూచి నవ్వుచు మైమరపింతువు. చిరునవ్వులతో దరిజేరిన యొకతెను కౌగిలిలో గౌరవింతువు. ఉద్యానవనమున నొక యువిద కనబడగా మాయమాటలతో పలుకరింతువు. ఇట్టి నయగారము, ప్రియము, చనవు సరస వాక్చతురిమ గలిగిన నిన్ను నమ్ముట యెట్లు? పసివాడవై రెండు మద్దిచెట్లను కూల్చిన నాటినుండియు, నీతోపాటుగా మాయలను కూడ పెంచుకొనుచు నెదుగుచుంటివి. నీ మాటలు నాకడ సాగవు వెడలిపొమ్ము. నిన్ను తాకుటకే సందేహము గలుగుచున్నది" అని ప్రణయరోషముతో పల్కినది.

4. మరియొక గోపిక "కృష్ణా ! ప్రేమతో యశోద యిచ్చు అమృతము వంటి పాలను గ్రోలుటమాని, విషముతో గూడిన పూతన పాలనే త్రాగితివి అని యందరును నిన్ను పిచ్చి ఓడ్డవని పరిహాసమాడుదురు కదా! ఔనుగాని, నీకడకు నా దూతికను పంపగా నామెను నీ కౌగిళ్లతో ముంచివైచితివి. ఇట్టి తుంటరితనము నీకే చెల్లినది సుమా."

అని దరికి జేరిన కృష్ణుని యెత్తిపొడుచుచు ప్రణయరోషముతో పల్కినది.

5. శ్రీకృష్ణుడు ఒక గోపికను వంచింపగోరి, యామె చూచుచుండగా ఆమె యింటి వీథిలో నర్ధరాత్రమున చీకటిలో, నొక గోపసుందరిని కౌగిలించుకొనుచు తనవెంట తీసికొని వచ్చి తిరుగాడసాగెను. అంతేగాక, తనబంగారు వస్త్రము చాటుంచి మరియొకతెను కను

సన్నలు చేయుచు పిలువసాగెను. ఆ సందర్భమున నా గోపిక, "నన్నేడ్పించుటకు ఇట్లు చేయుచుంటివి గాబోలును. నీ దుడుకు తనమును నే గాంచలేదందువా?" అని తృణీకార భావముతో తన ప్రణయకోపమును గనబరచెను.

6. మరియొకతె "కృష్ణా! నీవు నన్ను శయ్యమీద నిదురపుచ్చి, లేచి పోయినావు. నిన్నేగాని మరియొకరి నెరుగని, నన్నిట్లు వీడుటకు, నేనెంతో పాపమే చేసితిని. కాని నీవు మాత్రము ఆ రాత్రియు, మరునాడునుగూడ ఎందరినో కౌగిలికి జేర్చితివి. మల్లయుద్ధమున నీ బాహుబలము ప్రదర్శింపగలవు. కాని నన్ను శృంగారమున ముంచలేక పోయితివి. ఇక్కడనుందువేల వెంటనే ఆ కాంతలను కౌగిలించుటకు అక్కడకే వెడలిపొమ్ము" అని మాయలమారి కృష్ణుని జూచి ప్రణయకోపమున నీసడించినది.

శ్రీకృష్ణుడొకనాడు వేళగానివేళ యొక గోపిక యింటి కేగెను. ఆతని మాయలను గ్రహించిన యామె 'మా యింటి కిపుడేల వత్తువు? ఇక్కడ నీ పరిహాసములను మెచ్చుటకు తగిన కాంతలు లేరు, మరి యే మీనాక్షియును లేదు, నీ దగా మాటలకు మోసపోవుట నాకిక చాలును, నీ ముఖసౌందర్యమునకు నేను ముగ్ధురాలనగుటయు, నీ యధరోష్ఠమును గాంచి యానందించుటయును ఇంతటితో కట్టిపెట్టెదను. నీ మాయమాటలను ఇక నమ్మజాలను" అని రోషించి పల్కెను.

8. "నన్నిక్కడ వేచియుండుమని పల్కితివికదా! కాని దారిలో ఎదురైన యొక కాంతను మల్లె పొదరింటిలో ముద్దులలో ముంచుటకై సమీపింప పోయితివి. నన్ను చూచి, సమీపింపక, దాగుకొనుచుంటివి. ఈ చేష్టనాకు కోపము గలిగింప కుండునా! కానిమ్ము, నీ మందహాసాంచిత ముఖమునకు నీ నేత్ర కాంతులకును నే నింక నే మాత్రమును మోసపోవజాలను" అని తృణీకారభావముతో ప్రణయ రోషమున ఒక గోపిక పలికినది.

9. "కృష్ణా! నీవు శ్రేయములను గూర్చువాడవు. నెమలి పింఛము శిరోభూషణముగా దాల్చి రాణింతువు. నీ చెవులకు కర్ణికారము

అందమైన ఆభరణము. కనకాంబరము దాల్తువు. నీవు దారిలో నెత్తావివిరులను శిరస్సున దాల్చివచ్చు నొక భామినికి ఏదో సంకేతము పల్కి, ఆ యుత్సాహముతో, చిరుగజ్జెల మ్రోత చిందించు కాలినడలతో పుడమి కాంతకు ఒడలు జలదరింపజేయుచు, వేణుగానామృతమును గురిపించుచు, నాకడ కేల వచ్చితివి? నన్ను నీ వేల కౌగిలించవు?"

అని యొకతె శ్రీకృష్ణుని మాయచేష్టలనుగాంచి మెచ్చుకొనుచునే, ప్రణయరోషముతో పల్కినది.

10. "కమలలోచనుడవైన కృష్ణా! నిన్నెవ్వతయో పిల్చుచున్నది. చూడుము. నీ మనోహరమైన నాట్యభంగిమమును గాంచి యానందింప దలచి పిలుచుచున్నది. నీతో ప్రేమసంభాషణమును నెరపి, నిన్ను కోపింపజేసి యానందింపదలచియును ఒయ్యారముగా పిల్చుచున్నది. అటు చూడుము."

అనియొక గోపభామిని శ్రీకృష్ణుని మాయచేష్టలను నమ్మజాలక ప్రణయ కుపితయై వెటకారముగా పలికినది.

## సప్తమ దశకము

1. కృష్ణా! పద్మనేత్రా! ఏనుగుగున్నవలె బలప్రకాశుడవు. చిరునవ్వులతో రాజిల్లువాడవు. ఇక్షుఖండమువంటి దృఢగాత్రుడవు. యదువంశోద్ధారకుడవు. సముద్రకాంతి వంటి నీలదేహుడవు. గోపబాలుడా! నీవు నిదురబొమ్ము అని ఊయలలో నిన్ను పరుండబెట్టి, జోలలు పాడుచు ఊచునట్టి తల్లిని గాకపోయితిని.

2. ఎఱ్ఱని పద్మాలవంటి కాంతిగల నీ యడుగులను ముడుచు కొనుచు, వ్రేలాడదీసిన ఆటబొమ్మను, కాటుక కన్నులతో జూచి మెచ్చుకొనుచు, కదలుచు, ఊయలలో ఏనుగు గున్నయో, మేఘపు కూనయో యనునట్లు, ప్రకాశించు నిన్ను జూచి మెచ్చుకొనజాలని జన్మయైనది నాది.

3. బందుగురాండ్రు ఒక్కొక్కరే వచ్చి, ఎత్తుకొని ముద్దులాడి మానాన్న యేడి యని పలుకరింపగా, నీ ముద్దులవ్రేళ్లతో తండ్రియైన నందుని

జూపితివట. నా భర్త వసుదేవుని కా యదృష్టము పట్టునంతటి పుణ్యమును నేను చేసియుండలేదు కదా!

4. వెన్నెలను నింపి వసుధ కందముగూర్చు నిండుచంద్రుని బోలు నెమ్మొగము, పద్మముల కాంతిని మించు నేత్రద్వయము, సువిశాలమైన వక్షము, బలిసిన యాజానుబాహువులు, నీలమేఘమువంటి కాంతి గల దేహము, కోమలములై వంకరలు తిరిగిన శిరోజములు, ఇవి యన్నియు ఇప్పటి నీ యౌవనదశకు అందము గూర్చుచున్నవి. ఈ స్థితిలో నిన్నుగాంచి ఆనందింప గలుగుచుంటిని. కాని కృష్ణా! నీ శైశవపు చిన్నెలను గాంచని దైన్యమే నన్ను వేధించుచున్నది.

5. నల్లని ముంగురులు గల మోముతో విరాజిల్లుచు నన్ను గోముగా నీవు ముద్దిడుకొనుచుండగా అది జూచు నదృష్టము లేనిదానను. నీ యల్లరి రోషము, వచ్చీరాని పలుకులచందము, తండ్రిపోలికలు ఇవి యన్నియు గాంచి సంతసముతో ననుభవించినది ఆ యశోదయే కదా!

6. పసితనమున వచ్చీరాని నడకలతో చేయు నాట్యము, బూడిదలో బ్రుంగిన దేహముగల నిన్నెత్తుకొని లాలించుట, చిరువ్రేళ్లతో నీవు గిన్నెలోని పాయసమును నాకగా, మిగిలినది నేను గ్రోలుట, నాకు లభింపజేయని ఆ విధివ్రాత నాకెంత హీనమైనదో గదా!

7. ఒడిలో జేరి పాలుద్రాగుచు, నోటిలో చనుమొనను వీడి నవ్వుకొనుచు, రెండవవైపున నున్న చనుమొనను పట్టుకొందువు. ఆ శైశవపు చేష్ట గని యానందింపని తల్లినైతిని గదా!

8. కుండలో నీవు వెన్నను దొంగిలించి తినుచుండగా జూచిన యశోద కోపముతో నిన్ను బంధించుటకు త్రాడుగొని వచ్చుచుండగా వెన్నతో నిండిన నీ ముఖము ఎఱ్ఱని పెదవులు, దూరదూరముగా నుండి బెదరుచూపులతో నేడ్చుచు నమస్కరించుటగాంచి ఆ యశోద యొడలు మరచి, ఆనందముతో మునిగిపోయినదట.

9. అరవిందములవంటి నేత్ర సౌందర్యముతో నిండిన కృష్ణా! నీవు బాల్యమున గోవర్ధనగిరి నెత్తితివి. యమునలో కాళీయుని మర్దించి

గర్వభంగము చేసితివి. భాండనృత్యము గావించితివి. వత్సాసురుని గూల్చితివి. అట్టి, నీ బాల్యలీలలను నేనిప్పుడు మరల కాంచగలనా!

10. చనులందించి, విషమయములగు పాలనిచ్చిన పూతన ప్రాణాలను తోడివైచితివి. అందులకే గాబోలును నన్నును ఆ యశోదను వదలివైచితివి. కుమారా! అట్టి దివ్యలీలలను గావించిన నిన్ను జూచి యానందించుట కొఱకే నాప్రాణాలను నిలుపుకొంటిని.

## అష్టమ దశకము

రామా! నా హృదయమే నీకు ఊయలగా నమర్చితిని. అందు సంతోషముతో శయనింతువుగాని రమ్ము. దశరథతనయా! లాలీ కమలనేత్రా లాలీ, అని నీకు జోలపాడి నిదురబుచ్చుటకు ఊచుదును.

1. నీవు కౌసల్యానందవర్ధనుడవు. భూభారమును బాపుటకై రావణవధగావించితివి. దేవతలచే పొగడబడితివి. వారి సేవల నందుకొంటివి.

2. లోకాల నన్నిటిని సృజింపగల బ్రహ్మకు పుట్టిల్లు నీ నాభికమలము. వాత్సల్యరూపుడవు. దిశలన్నిటిని రక్షించువాడవు. నీ చరితామృతము సత్పురుషులచే సేవింపబడునది.

3. పూలతో నిండిన చక్కని శిరోజాలంకరణము గలవాడవు. జనకునికి అల్లుడవు. దాశరథివి. మహారాజవంశమునకు భాగ్యమగు అమృతము వంటివాడవు. రమ్ము. నన్ను దయతో జూడుము.

4. జానకీవల్లభా ! కోదండపాణీ! ముల్లోకాలను సృజింపగల నీవు అల్పనృపుడైన దశరథు నింట జన్మింప నేర్చిన నీ కరుణాతిశయము వర్ణింప నా తరమగునా?

5. సమస్త రాజ్యసంపదయును సంతోషముతో భరతున కిచ్చి వైచితివి. లక్ష్మణుని సేవలంగొనుచు వనవాసమున కేగి, తండ్రి యాజ్ఞ పాలించితివి.

6. పురజనులు బందుగులు, పరిచారకులు నుండగా, నీ పరిచర్యకొఱకే కూడవచ్చుచున్న లక్ష్మణునితో గలసి, శరణాగతులను కాపాడుటకై సీతాదేవితో గలసి యడవుల కేగితివి.

7. బాలకుని వలె వటపత్రశాయివై, ప్రపంచమంతయు నీలోన నిల్పి రక్షించితివి. వాలివధ చేసితివి. సుగ్రీవుని కాపాడితివి. భూమియందు ధర్మమును వర్ధిల్లజేసి యేలితివి.

8. వానరులతో గూడి సముద్రమును బంధించితివి. రావణునితో గూడ లంకను నాశనము చేసితివి. సముద్రమథనముగావించి దేవతల కమృతము నొసంగితివి. పుడమికి ఉపద్రవమును తొలగించితివి. నీ సౌశీల్యమును ప్రకటించితివి.

9. సాకేతనాథా! సురలను యక్షులను, నాగులను దివ్యసంపదలను నీవే సృజించితివి. భక్తులచే సేవింపబడునవి నీ పవిత్ర పాదములు. మునుల హృదయాల నీవు నెలకొని యుందువు. నిన్ను శరణము వేడుచుంటిని.

10. తల్లియగు కౌసల్య శ్రావ్యగీతికలతో నిన్ను లాలించి పెంచినది. సేవకుడనైన నాయొక్క గీతమును ఆలించి మెచ్చుకొనుమని వేడుదును. కనికరముతో నన్ను కాపాడుటకు రమ్ము.

రామా లాలీ మేఘశ్యామ లాలీ అనుచు పైవిధముగా ఆళ్వారులు జోలపాటలు పాడుచు శ్రీరామచంద్రుని తమ హృదయమను ఊయలలోనికి రమ్మని వేడుకొనిరి. ఆ పాటలో శ్రీరామావతార మహిమను కొనియాడినారు.

## నవమ దశకము

1. సమస్తమును రక్షింపగలవాడు. సకల సద్గుణములచే ప్రకాశించువాడు. సత్పురుషులచే నమస్కరింప దగినవాడు. సాటిలేని సాహసౌదార్యములు గలవాడు. పౌరులకు సుఖము నొసంగువాడు. యౌవనరాజ్యపదవిని బడయుటకు సిద్ధముగానున్న వాడు. సౌమ్యుడు. వేద వేదాంగములు నేర్చినవాడు. అట్టి సుకుమార పుత్రుని రామచంద్రుని

అడవులకు బంపితిని. కులీనురాలైన కైకవాక్యములకు బద్ధుడనైతిని. అన్నివిధాల వంచింపబడి జీవచ్ఛవముగా నుంటిని.

2. రామచంద్రా! కుమారా! ప్రేమకు నిలయమైన సత్పుత్రా! నా కఠిన వాక్యములను విని పాలింపదలచి అఖిలరాజ్య సంపదను వదిలినావు కదా! వేలాయుధమువలె చక్కని నేత్ర సంపదగల రామభద్రా! సీతతో గూడి యడవులకు పయనమైతివి. ధర్మప్రతిష్ఠయే నీకు మార్గముకాగా అడవుల నిడుమల బడయుదలచి, కాలి నడకనే బయలుదేరితివి. అయ్యో! నన్నేల చూడవు? చేయునదిలేక నేను భూమిపై దీనముగా పడియుంటిని.

3. రామా! సాధుజన రక్షకా! జగదేకప్రియా! రక్తాంత లోచనుడవు రామభద్ర! పర్వతమువలె దృఢమైన బాహు సంపదగలవాడవు. ధర్మ స్వరూపుడవు. సత్యమైన ప్రకాశముగలవాడవు. పతివ్రతయైన కౌసల్యకానందవర్ధనుడవు. శార్జ్గహస్తుడవు. సుజనస్వరూపుడవు. నీవు పాపాత్ముడనైన నా కఠిన హృదయమును గరగించితివి. అయ్యో! అంతఃపురమున మృదుశయ్యపై శయనించి నిద్రింప నలవాటుపడిన నీవు చెట్లనీడలందు కటికరాళ్లమీద ఎట్లు నిదురింప గలుగు చుంటివోగదా!

4. జానకిం బెండ్లియాడుటకు శివుని ధనుస్సును ద్రుంచితివి. రామా! యిటు నాదరి కొకసారివచ్చి కొంచెము సేపుండి వెడలుము. అయ్యో! మదపు టేనుగుల సంచారముతో నిండి, భయంకరముగా నుండు అడవిలో నుండుచు నాకు దూరముగా నుంటివి. ఈ స్థితిలో నా హృదయము కఠినమైన రాయివలె నుండి వ్రీలదు గదా !

5. ప్రేమతో నన్ను తండ్రీ! యని పిలుచుచుండగా వినలేకయు, నీ గజ యానమును, నీ ముఖపద్మమును గాంచి యానందింప లేకయును నిన్ను ప్రేమమీర కౌగిలించు నదృష్టమును పొందలేకయు, నిన్ను అడవులకు బంపి, పాపమతినై దుఃఖములో మున్గిపోయితిని.

6. ప్రేమ లేని కైక కోరిక నెరవేర్చుటకును, నా దురుక్తులను పాలించు టకును ఘోరాటవులం బట్టితివి. ఆకలి కెట్లు ఓర్చుకొనుచుంటివో, వాడి రాళ్లపై నెట్లు నడువగలుగుచుంటివోగదా!

7. పుణ్యాత్ముడవగు సుమంత్రా! వేదవిదులైన బ్రాహ్మణులారా! యౌవ
నము నందే జటలు నార చీరలు ధరించి శ్రీరామచంద్రుడు వనవాసి
యౌటయు, మరీ వృద్ధుడనైన నేను పురమున సుఖపడుటయు
నిది యేమి న్యాయమో! మీరలు నిర్ణయింపగలరా?

8. కైకా! ప్రియమైన పెద్ద కుమారుని, ధర్మవేత్తను, ప్రజ్ఞాన్వితుని
రాముని, వినయాన్వితుడగు లక్ష్మణుని, సుకుమార సుందరియగు
సీతను అడవులకు బంపి సంతోషించుచుంటివి. భరతుని నింద
లపాలు చేసితివి. నాకు మృత్యువునే అర్పించితివి. ఎంతటి
దారుణమైనదానవో కదా!

9. రామచంద్రా! పరశురాముని చేతి వైష్ణవ ధనుస్సు నొక్క త్రుటిలో
నెక్కిడితివి. అతని తపస్సిద్ధిని నశింపజేసితివి. నీ వియోగమును
భరింపలేక దుఃఖపడు తల్లినైన లెక్కచేయక నా యాజ్ఞను పాలిం
చుట కడవులంబడితివి. జానకీనాథా! సద్గుణనిధీ! రఘువంశవార్ధికి
చంద్రుడవు నీవు. అట్టి సౌమ్యుడవు నీవు, నా కేడేడు జన్మలందును
తనయుడవుగా జన్మింప, దైవమును గోరుకొందును.

10. రఘువంశవర్ధనా! సర్వజగదభిరామా! సౌజన్యధామా! రామచంద్రా!
పరశాత్మలైన కౌసల్యాసుమిత్రలు దుఃఖించుచుండ పరిగణింపవైతివి.
ముదుసలిది క్రూరురాలు ముంగోపియైన మంథరమాటలకు లొంగి
కైక యాజ్ఞ చేయగా నడవుల కేగితివి.

ప్రసిద్ధమైన అయోధ్యా పట్టణమును వదలివైచితివి. ఇక నాకు పట్టణ
మున నేమి మిగిలినది? నే నిప్పుడు స్వర్గమునే కోరుకొనుచుంటిని.

## దశమ దశకము

1. తన దివ్యతేజముతో విశ్వము నెల్ల ప్రకాశింప జేయువాడు. సూర్య
వంశమునకు శిరోభూషణము. నీలమేఘశ్యాముడు. రక్తాంతలోచ
నుడు. గొప్పవియైన ప్రాకారములతోడను, ప్రముఖములైన సౌధము
లతోడను, గూడిన అయోధ్యాపురమును తన తేజంబుతో నింపెడు
పురుషోత్తముడు. భక్తుల కభయహస్త మొసంగువాడు. కౌసల్యానంద

వర్ధనుడు. అట్టి శ్రీరామచంద్రుని, పరమభక్తితో, నా హృదయమునం దధివసింపగోరి, మనసార, చేతులుమోడ్చి నమస్కరింతును.

2. శ్రీరామచంద్రుడు జగదభిరాముడు. విశ్వామిత్రుని యాజ్ఞననుసరించి, ఆడుది యను శంకను వీడి, గాటమగు బాణమేసి, తాటక యురమును ప్రక్కలించి, వధించెను. ఘోర రాక్షసుల అడవులలో నేరి నశింపజేయుచు, క్రూరుడగు సుబాహుని వధించెను. మారీచ రాక్షసుని తన బాణముచే ఎగురగొట్టి సముద్రమున కూలద్రోసెను. అట్లు తన ప్రతిజ్ఞ ననుసరించి మునులను రక్కసుల బారి పడకుండ కాపాడి, గాధేయుని యజ్ఞసంరక్షణమును చేసెను.

3. శ్రీరామచంద్రుడు జనకుని కూతురగు జానకిని పెండ్లియాడువేళ గాధేయు నాజ్ఞననుసరించి, రాజసభలో శివధనుర్భంగముగావించెను. అయోధ్యకు ప్రయాణమై పోవుచు దారిలో నెదురైన పరశురాముని చేతి ధనుస్సు నెక్కిడి, అతని గర్వంబును, తపస్సిద్ధియు పూర్తిగా నశింపజేసెను. ఆ ధనుస్సును వరుణునిచేత నిడెను. ఆ సందర్భమున పరశురాముని ధనుస్సును గ్రహించుటతో బాటు వైష్ణవతేజమును గూడ పడసెను. పిమ్మట తన తల్లిదండ్రుల నానందపరచుచు, జానకీ సహితుడై పూర్ణపురుషుడుగా అయోధ్య కేగెను.

4. కైక పల్కిన మాటయే తన తండ్రి యొసగిన యాజ్ఞగా గ్రహించి, సకలరాజ్యమును త్యజించివైచెను. తనకు భక్తుడైన గుహుని సహాయము వలన గంగానదిని దాటి యడవుల బ్రవేశించెను. తనకడకు వచ్చిన ప్రియసోదరుడగు భరతుని మనస్సునకు శాంతిని జేకూర్చి, తన పాదుకల నిచ్చి యయోధ్యకు బంపివైచెను. అడవిలో చిత్రకూటాద్రి యందు, ఒక చోట నాశ్రమమును కల్పించుకొని, జానకియు, సౌమిత్రియు తనను సేవించుచుండగా నా యాశ్రమమున, ఋషివరుల మధ్య శ్రీరామచంద్రుడు, వారికి నేత్రపర్వముగ వసించి యుండెను.

5. పరశురామ గర్వభంగసమయమున వరుణుని చేత నుంచిన ధనుస్సును బాణతూణీరములతోడను శస్త్రాస్త్రములతోడను, అగస్త్యమునిని సేవించి పడసెను. అడవులలో ప్రయాణించునపుడు,

దారులలో నెదిరించు ఘోర విరాధాదిరాక్షసుల వధించెను. రావణుని చెల్లెలగు శూర్పణఖ ముక్కు చెవులను, లక్ష్మణుని చేత నరకించి వైచెను. తనను ఎదిరింప వచ్చిన ఖరదూషణాది పదునాల్గువేల రక్కసులను తానొక్కడే త్రుటిలో వధించివైచెను. మాయ లేడిగా వచ్చిన మారీచుని కడ తేర్చెను. ఇట్లఖిలరక్షకుడై శ్రీరామచంద్రు డడవులందు జానకితోడను, లక్ష్మణునితోడను సంచరించెను.

6. జానకిని వెదకుచు తిరుగునపుడు జటాయువును స్వర్గమున కనిపెను. కిష్కింధయందు వాలిసుగ్రీవులు ద్వంద్వయుద్ధము చేయుచుండగా, చెట్టు చాటుననుండి సింహవిక్రముడైన వాలిని వధించి, సుగ్రీవునితో స్నేహమును పెంపొందించుకొని, యాతనికి కిష్కింధారాజ్యము మొసంగెను. జానకిని తోడితెచ్చు ప్రయత్నమున, లంకను హనుమంతునిచే కాల్పించెను. ఆ విధముగ త్రైలోక్యరక్షకుడైన రామచంద్రుడు రావణుని ధైర్యమును అణచివైచెను.

7. తన ధనుస్సు నెక్కిడి, బాణమును సంధించి, సముద్రుని గర్వమణచి తనకు దాసోహమనునట్లు చేసెను. వానర సహాయమున, వార్ధిని బంధించి, సేతువును నిర్మించి, వారితోగూడి లంకలో ప్రవేశించెను. రాక్షసులతో గూడ రావణుని యుద్ధమున జయించెను. శరణమిచ్చిన విభీషణుని లంక కధిపతిగా జేసెను. రావణవధానంతరము సీతను గూడి శ్రీరామచంద్రుడు జగదభిరాముడై సాకేత పురమును జేరెను.

8. రావణుని వధించి, భూభారమునుబాపి, మణులతోనిండి యందముగా ప్రకాశించు బంగారుమేడలతో నిండు నయోధ్యలో బ్రవేశించి పట్టాభిషిక్తుడై రాజ్యమును ధర్మయుక్తముగా నేలెను. అగస్త్యుడు వినిపింపగా రావణుని పూర్వజన్మ వృత్తాంతమును దెలిసికొనెను. మధురరసాన్వితమైన తన చరిత్ర మంతయు కుశలవులు శ్రావ్యముగా పాడి వినిపింపగా ప్రీతితో, సమ్మదాశ్రువులు రాల్చుచు వినెను.

9. జగదభిరాముడై శ్రీరామచంద్రుడు రాజ్యము చేయుచు నారదుని యాజ్ఞననుసరించి తీవ్రతపమొనర్చు శంబూకుని వధించెను. బ్రాహ్మణ బాలుని ప్రాణముల నిల్పి వర్ణాశ్రమ ధర్మములను రాజ్యమున నెల

కొనజేసెను. అగస్త్యుడు మెచ్చి, తనకు దేవత లొసంగిన దివ్యహార మును బహూకరించగా శ్రీరామచంద్రుడు సంతోషముతో ధరించెను. యుద్ధమున లవణాసురుని వధింప శత్రుఘ్నుని నియమించెను. ఒక నాడు కాలునితో గూడి ఏకాంతముగ రహస్యములను వినుచుండగా దుర్వాసముని యేతెంచెను. ద్వారముకడనున్న లక్ష్మణుడు విధిలేక లోనికేగి మునిరాకను దెల్పెను. ఆ సందర్భమున సమయభంగము జరుగుట కిష్టపడక తన వెంట నీడవలె ననుసరించు ప్రియ సోదరుడైన లక్ష్మణుని ధర్మాభిరతుడై విడనాడెను.

10. సౌమిత్రి యంతట తనుదాన స్వర్గమునకేగెను. లక్ష్మణుని వియో గమును భరింపలేనివాడై త్రైలోక్యరక్షకుడగు రామచంద్రుడు రాజ్య మును విడిచి, తనకు శరణాగతులైన పౌరులను పశుపక్ష్యాదులను వారి కోర్కెల ననుసరించి సరయూనదీముఖంబుగా స్వర్గమునకు బంపెను. అంతలో వైనతేయుడు రాగా, అతనిని వాహనముగా జేసికొని వైకుంఠ ధామమును జేరెను.

సమాప్తము